పూర్వ గుచ్ఛము — వెల 6 అణాలు.

ఉత్తర గుచ్ఛము — వెల 10 అణాలు.

---

# కమలామణిలేఖలు

---

గ్రంథకర్త :— బి. ఏ., బి. ఎల్., హైకోర్టు వకీల్,

రెంటాల - వేంకట సుబ్బారావు పంతులు.

# విజ్ఞాపనము.

ఉద్యోగకారణమున విదేశగతుఁడైన భర్తకు కమలామణి వ్రాసిన యీ లేఖలు వట్టి వలపుజాబులు గాక ప్రేమామృతముతోడ నిండి లోకాచార వ్యవహారముల విచిత్ర వర్ణనము కలిగియుండుటచే స్త్రీపురుషులకెల్ల పఠనీయములు. ఆన 1902 సం॥ జూను మాసములో నివి యాంగ్లేయభాషలో ప్రచురింపఁబడి ప్రపంచమెల్లెడల వ్యాపించియున్నవి. చక్రవర్తి మొదలుగ లక్షలకొలఁది జనులు చదివి శ్లాఘించియున్నారు. లేఖారూపకమయ్యును చదువఁ జదువ కట్టుకథగాఁ గన్పట్టి, తుట్టతుదకు కమలామణికి సంప్రాప్తమగు దుర్గతి అత్యంత వ్యసనకరముగా నుండును.

చిరకాలము నుండి ప్రయత్నించినను ఈ గ్రంథము దేశభాషలలో తయారుకాఁబడక గొప్పకొఱంత యేర్పడియెను. అనేకసార్లు ప్రయత్నము చేయఁబడి దుస్సాధ్యమై విడిచిపెట్టుట తటస్థించెను. ఇప్పుడీ లేఖల యదృష్టము బయలుపడుట కేవలము దైవికమే. అయినను, విశేషముగా ప్రతులు ముద్రించుటకు వీలులేనందున చదువనేర్చిన స్త్రీపురుషులందఱు వెంటనే తెప్పించుకొని చదివి యానందింతురని నమ్ముచున్నాము. శ్రీ శ్రీ శ్రీ.

---

విక్టోరియా డిపో - మైలాపూరు - మద్రాసు.

# పీఠిక.

ఈ యపూర్వ లేఖలను చదువువారెల్ల వానిని లిఖియించిన కమలామణి యెవ్వరని యడుగుదురు. అట్టి యబల యే లేదనియు ఆయమ పేరిటి యీ విచిత్ర లేఖలు చమత్కార కల్పితములనియు పలువురు తలంతురు. ఇవి నే నెఱుఁగని విషయములు కావు. ఈ లేఖలను ప్రచురింప నిశ్చయించుటకు మున్న నన్నే యా సందియములు బాధించెను. ఈ విద్యావతి యెవ్వర్తో ఎట్లేని కనుఁగొనవలయునని మునుమున్న నాకభిలాష కలిగి వెనువెంటనె ఆ సతియు జాబులును గూడ మిథ్యారూపమ్ములని యభిప్రాయమ్ము మీఱెను. కాని, అవి కల్పితములే యని నొక్కి వక్కాణింపఁ దగిన కారణములు జాబులందేమియుఁ గానంబడకుండుటయు మన మనుదినము గనుచుండు మనుష్యులును విషయములునే వాటియందు ప్రదర్శింపఁబడి యుండుటయుఁ దలఁచితలఁచి, ఎట్టి ప్రాజ్ఞులకున్ను పలుమాఱు నిజముకల్లగఁ గన్పట్టుటయు కపట వేసము దాల్చినకల్ల యదార్థముగఁ జెల్లుటయు నెంచి, నా యనుమానమణఁగఁ ద్రొక్కికొని, ఆ లేఖలు నిక్కముగ నొక్కలలనామణి లిఖియించినవా యనుమాటే పాటింపక, అట్టివి గా

కున్నను ప్రపంచమునఁ బ్రచురింప యోగ్యములా యను అంశముమాత్రము చర్చించి నా నిశ్చయమేర్పఱచుకొంటిని. అవి యదార్థములౌను కావని నిర్ధరించి నుడువుటకు నే నశక్తుఁ డనుగదా !

ఇంక నీ లేఖల విషయమున నాకుఁ గల సంబంధమిట్టిదని వేఱుగఁ జెప్పఁబని లేదు. దానికి నేను ప్రచురకర్తగ నేర్పడి తిని ననుట స్పష్టము. అది యెట్లు తటస్థించెనో యీ దిగువ తెలిపిన సంగతులవల్ల తెల్లముకాఁగలదు.

కొన్ని మాసముల క్రింద నొక భానువాసర ముదయమున భోజనానంతరము పడక కుర్చీపై వెన్ను సాచి పండుకొని వార్తాపత్రిక చదువుచు ఒక్కింత కన్ను మోడ్చి కలలోఁ దగిలితి. అపుడు నా సేవకుఁడు మొద్దుకాగితమునఁ జుట్టి యెఱుపు నలుపు దారములతో భద్రముగఁ గట్టిన యొక పెద్ద పుస్తకము తెచ్చి నా చేతి కందిచ్చెను. చందా పుస్తకము తక్క మఱే పుస్తకముగాని జాబుగాని వచ్చినపుడెల్ల నెంతో సంతోషముతో దానిని గైకొనువాఁడ గావున ఆ కట్ట నాసతో నంది పుచ్చుకొంటిని. దాని విడుపు వెడల్పు లొక్కింత యనుమానము గలిగించెఁగాని అది యరుదెంచిన తెఱఁగు పరికించి మాటి మాటికి ప్రాణముతీయు చందాలపీడ కాదని నిశ్చయించుకొంటిని. ఇంతలో ఆ కట్ట కట్టులలో నిమిడ్చిన యొక జాబు నాపైవిలాసముగలది కాన్పింప దాని నల్లన వెలికిఁదీసి చించి చదువుకొనఁ దొడఁగితిని. పైవిలాసమువలెనే జాబును

అచ్చక్షరములతో గ్రుచ్చి లిఖియింపఁబడి యుండెను. స్థల
కాలసూచన లేని యీ లేఖ యెట్టిదన :—

" అయ్యా !—ఈ జాబును దీనితోడవచ్చెడు వ్రాతపుస్తక
మును మీ కడకంపి శ్రమయిచ్చుచున్నందుల కెట్లు క్షమా
పణ వేడికొనఁదగునో తెలియనేరకయున్నాఁడను. దాదాపు
ఆఱుమాసముల నుండి తలపెట్టుచు మీ సముఖమ్మునకు దీ
నిని బనుప ధైర్యముచాలక యుపేక్షించి యిపుడును గొంత
యధైర్యముతోడనె బంపుచున్నాఁడను. కాని, పరిపూర్ణ
ముగాఁ బరిశీలింపక నా ప్రార్థన వ్యర్థము చేయరనియు నా
మాటలు వట్టి బూటకములుగ భావింపరనియు నమ్మెదను.

" నాకు తటస్థించిన గొప్ప విపత్తు నేను వివరింపఁబూను
కొనను. ఈ నాపంపించు వ్రాతపుస్తకమును జదివిన మీకే
విశదము కాఁగలదు. చదువుటయు మిగుల మనోహరముగ
నుండును. సాధ్యమైనంతవరకు విడివిడి యక్షరములతో
విస్పష్టముగ వ్రాసితిఁగాని యెంతప్రయత్నించినను నా స్వ
భావ నింగ్లీషుపాటి చక్కఁగ లిఖియింప నేరమికి మిగుల లజ్జపడి
యెదను. ఈలేఖలవిషయము రహస్యముగనుంచఁ గోరుటచే
వాని నీ పుస్తకమందు నే న్వ్రాయవలసివచ్చెను. అవి మీరు
సమగ్రముగఁజదివితి రేని నాచరిత్రమెల్ల తెల్లము కాఁగలదు.
నే నుడువవలసిన దెద్దియు లేదు. కొద్దికాలముక్రిందట నే నా
బొంది కుసురుగనుండిన తరుణీమణి యిప్పుడు ప్రజ్ఞచెడి ఉ
న్మత్తయై నన్ను గన్నంతనె పులినో భూతమునో గన్నయట్లు

భయపడుచున్నయది. ఇది నా గ్రహచార ఫలము! నా దుర
దృష్టవికార మీ తీరున పరిణమిల్లియున్నది!

"మీరు వేదాంతసమాజమునఁ జేరినవారు కారని యెఱుఁ
గుదును. ఇంతశ్రమ దీసికొని నన్నుఁ బురికొల్పిన నా యుద్దేశ
మును విన్నచో నొకవేళ నన్నుఁగూడ ఉన్మాదితునిఁగ భావింతు
రోయని భయమొదవుచున్నయది. కాని నా శ్రమ నిష్ప్ర
యోజకము కాదని నమ్మెదను. నా ప్రేయసిచిత్తమునఁ దవిలి
యనుమాన విషమూలిక మొలిపించి మా యిరువుర సౌఖ్య
మును సున్న గావించిన దుర్మార్గమునందు కలలోనైనఁ బ్రవ
ర్తించినవాఁడఁగాను. అటుగా నాపై స్వస్థతకై నే దినదినము
చెల్లించెడి యనూనప్రార్థన నిరర్థకమగునని యెట్లు తలంపఁ
గలను? వెఱ్ఱి భ్రమయైనఁ గావచ్చును గాని వేలకొలఁది
విద్వాంసుల ప్రార్థనలు నాకు తోడ్పడినచో నా కోరిక అతి
శీఘ్రముగ ఫలియించునని నమ్మికయేర్పడిది. అనంతకోటి
అద్భుతగోళములకు మూలాధారమగు పరాశక్తిని జనియిం
చిన మానవబుద్ధిమహిమ యెల్లప్పుడు గొప్పగ గణియింతును.
జనవాక్య మీశ్వరవాక్యతుల్యమనుగుటే చిరకాలమునుండి
నా మదిని స్థిరపడియున్నయది.

"ఇట్లు ఉపకారము వేఁడి మీకు నేను గలిగింపఁదలంచిన
పని చులకనగ నెఱవేఱఁగలది కాదు. ఇది నే నెఱుఁగుదును.
లేఖాకర్తకు ప్రాప్తించిన దుర్గతిని ప్రపంచమునఁ గల దొడ్డ
బుద్ధిదారులకు తెలిపి వారి యాశీస్సు పడయవలెనన్న లేఖల

నింగ్లీషుభాషకు మార్పవలయుఁగదా? ఈ కార్యమును సమర్థింప మీకన్న మిన్న లెవ్వరు? మీ సామర్థ్యమును మీ దీనదయార్ద్రహృదయమునుఎల్లప్పుడుకొనియాడువాఁడఁగావున ఈ లేఖలను మీ కడకంపుకొంటిని. నా యాసయు ఎన్నికయు విచారమువలన వికసించిన వెఱ్ఱివేదాంతమని తలంచినఁ దలంతురుగాక. ఇందిమిడియుండెడి మన యాచార వ్యవహార వర్ణనములకైన నీ లేఖలు ప్రచురయోగ్యములని భావింపఁజాలరా? ఆర్యా! తమదయను మితిమీఱి కోరితినా?

"అన్నిటికిని మీ చిత్తము మీ ప్రియమని తెలుప ననావశ్యకము. లేఖలున్నవియున్నట్టులొక్కముక్కయుఁ జేర్పక విడువక వ్రాసి యంపితిని. వీరువారని తెలియకుండ పేరులు మాత్రము మార్చితిని. ఇంత శ్లాఘ్యములగు నీ లేఖలు కల్పితములని తమ మనమునకుఁదోచిన, అట్టి మీ తలఁపును బోఁగొట్టఁగల కాలము రావలెనని కోరుకొనుచు మీ యభిప్రాయ మటులుండియు వానిని నే చెప్పిన చొప్పున ప్రచురించితిరేని వేనవేలు వందనము లిడువాఁడను. ఎట్లును ఏ తీఱునను ప్రచురింపక యుండునట్లు తమ నిశ్చయమేర్పడినచో, ఈ యంపినజాబులు నిదిగూడ సత్యదేవతసాక్షిగ మన్ను సేయవలయునని నా విన్నపము. వానిం ద్రిప్పియనుపఁ జొప్పడదుగదా! ఈ విచారకరవిషయ మంతటితో సంతరించునని నా మాట విశ్వసింపుఁడు. ఇట్లు యదార్థముగ మీ యనువర్తనుఁడు

"కృష్ణమూర్తి."

చేవ్రాలుమాత్ర మచ్చక్షరములు గ్రుచ్చివ్రాసినదికాదు. జాబు సగపాలు చదువకమునుపే యిది కనుఁగొని ఆ సంతక మేని సంతక కర్తనేని గుర్తింపనేరక ఆ పుస్తకపుఁగట్ట కొని తెచ్చినవాని నిటు పిలువుమని నా సేవకునిఁ బంపితిని. వాఁడు మరలివచ్చులోపలనె జాబుసాంతముగఁ జదివినవాఁడగావున, అతఁడప్పుడె వెడలిపోయెనని వినుట కొక్కింతయు వింతపడ నైతిని.

అంత నా లేఖలను చూడవలెనను కోరిక యెంతయు నుప్పొంగఁగా కట్టు ద్రెంపి యీ పెద్దపుస్తకము తెఱచితిని. అది యెల్ల నప్పుడు చదువఁ దలంచియుండను గదా! ఎట్లుండునో యని మొదటి నాల్గయిదు పొరటలుమాత్రము చదువ, వాని వలన మఱికొన్ని పొరటలు, వీనిం జదివి మఱికొన్ని, అటుపైఁ గొన్ని, ఇట్లు చదివిచదివి గ్రంథము తుదముట్టెనని తెలిసి కొంటిని. ఆనడుమ నేను ఫలాహారము గావించినది కూడ నెఱుంగనైతిని!

అటు పిమ్మట నీ లేఖలు నిక్కములాయని నాలో నేను తర్కించుకొనఁ బూనితిని. కాని నా యభిప్రాయము పలుమాఱు మారుటచేత ఆ యంశమటుండ నిచ్చి యవ్వాని యోగ్యతాయోగ్యతలను గూర్చి యోచించితిని. ఎవ్వరు లిఖించిననేమి యీ లేఖలు రమ్యతరమై రంజిల్లుటయు చిన్న కథవలెఁ జెన్నుమీఱుటయు నొప్పుకొనక తప్పదయ్యెను.

స్త్రీ హృదయమును హస్తమును గూడ వానియుందెల్లెడలఁ గన్పట్టునట్లు భావము నామదిని గుదురుకొనఁ దొడఁగెను.

ఇదియెల్లఁ దలతోకలు లేని కల్లకలయని యెట్లు తలంపఁ జెల్లును? ఆ లేఖల నాతఁడు కోరినట్టు లింగ్లీషుభాషకు మార్చి ప్రచురింపఁ బూనుదునా? ఇది సుకరముగాకుండియు నాతని కోర్కె నెరవేర్పవలయునను అభిలాష విశేషించి నన్నుంబురి కొల్పుడు, నా యాత్మముఖమ్మున ఆ జాబులను ద్రోలి యీ లీల వెలిపఱచితి. కాని వానియం దెక్కువ మార్పు లేమియుఁ జేయక అక్కడక్కడ పునరుక్తములై యుండిన పదములు వాక్యములుమాత్ర మొక్కింత చెక్కితిని. ఇట్టి పునరుక్తము లెట్టివారు లిఖించిన లేఖలయందును గన్పట్టుట కద్దుగదా? మొట్టమొదట ఈ లేఖలలోని కొందరిపేర్లు మార్చవలెనని యెన్నితిఁగాని మార్పుపై మార్పుగావించినచోఁ దొంటివే మరల రావచ్చునని తలంచి యటుసేయుట మానుకొంటిని.

ఇంక నేఁజెప్పవలసిన దేమున్నది? ఈ జాబులను చదువు వారెల్లరు వాని గుణసారములఁ గ్రహించి యానందించుట కోరుదును. తప్పులు వెదకు తర్కశాస్త్రులు వారికి—చదివి సం తోషింపుడు!— అని యొక మందలింపుమాట నుడువుదును.

1 - వ జూను 1902. ప్రచురకర్త.

# కమలామణి లేఖలు.

## 1-టి లేఖ.

నాథా! ఈ రెండుగంటల కాలములో నెట్టి దుశ్శకునములు! నే నింటికి మరలివచ్చునపు డినుఁడ స్తమించుచు నా మది కొక్క వక్ర, అతి వక్రాభిప్రాయమును దోపించెను—నా విచారముగని నన్నాతడు గేరుచుండెనని తలఁచితిని! అటుపై కల్యాణి కళ్లెమునకు లోఁబడక ఒకటే పరుగున మమ్మీడ్చుకొనిపోవుట గని ప్రాణభయముగూడఁ జెందితిని. ఇచ్చటికి వచ్చిననో, వాటికిముందర నె మార్జాలశనైశ్చర మెదుర్పడవలెనా! ఇంక లోనికిఁజొర కృష్ణుఁడు ననుఁగని పలుకరింపక—ఒక్క పలుకేని పలుకక—పోయెను! ప్రియవరా! యీ బొందినుసురున్నదని యెన్నదరా?

ఇదెల్ల మూఢభీతియ కాఁజెల్లును. కాని యది నామదిని దగిలి లోఁతుగ బాతుకొన్నయది. ఇపుడొక్కింతయేని నను శాంతపఱచి చక్కఁజేయఁగలది మీసురుచిరరూపసాన్నిధ్య మొక్కటెగదా! అది యెట్లు పొసఁగును? ప్రతి నిమేషము మన మొండొరులకు దవ్వగుచున్నారము! మన హృదయములు, ప్రేమానుబంధముతో పెనగొన్న మన హృదయములుగూడ నొండొంటికి దవ్వులై యెన్నడేని వేరగునాయని ఆశ్చర్యముతో నను మ్లానపడ దొడఁగితిని. అట్టి యిక్కట్టు పుట్టునని తలపోయుటయు భయంకరముగ నున్నది.

అదిగో! అదిగో! దొంగగాఁడిదె! — నేను లోనికివచ్చి నపుడు చచ్చినవానివలె నోరెత్తక యూరకుండెను! మూయుము! కొంటెభడవా, నోరుమూయుము! "కమలామణీ!" — "కమలామణీ!" — కూర్చుండియున్న దానను ఎప్పటివలె మిమ్మెదుర్కొన లేవఁబోతినిగదా!

నా స్వకీయధనమా! నన్నేల యిచ్చో వదలిపోతిరి? శాపము లెల్ల నాతలకుఁ జుట్టుకొనియెనా? అయ్యో నా యనుమానము నాయనుమానము! నా భయము! నాభయము! నా మనమునఁగల సంక్షోభము సర్వేశ్వరుని కెఱుక!

## 2-వ లేఖ.

ప్రియవరా! — నిన్నటిరాత్రి తమకేమి వ్రాసియంపితినో జ్ఞాపకమే లేదు. కాని, యది వ్రాయకుండిన మేలుగ నుండి యుండునని తలఁచెదను. నా సంతాపమువలన గాఢ నిద్ర కలుగ, ప్రాణము లొక్కింత గోల్కొని యిపుడిప్పుడ మేల్కాంచితిని. ఆహా! నిద్ర లేవఁగనె తమ మధురనామము నా వీన్నులకు విందుగ వినఁబడెను గదా! అది కృష్ణుని పని. ఆ నిముసమె యా ముద్దుపట్టి చెంతకుఁజని చెఱనుండి వానిని వెలికిఁదీసి తెక్కలు నువ్వి మక్కువమీఱ నొక్కముద్దు వెట్టితిని. అతడిప్పుడు గావించిన ప్రియనామ స్మరణనకును రాత్రి భరించిన దూషణనకును పారితోషికమని యెంచితిని. కాని, ఆశపాతకుఁ డొక్కటితోడ తృప్తిచెందక నా పెదవులును

చెక్కిళులును ముక్కునఁ గ్రుక్కి గ్రుక్కి — ఔరా ! — మఱి మూఁడుముద్దులు గొనియేను ! మీరు గ్రామాంతరమున కరిగిన వార్తయెవ్వరేని వానికి తెలిపిరోయని తలఁచితిని ! నా మురిపెపుమాట మీ పేరుగల యీ చిట్టికీరముపై వైరముఁ దాల్పరుగద !

ఇప్పుడు తెల్లగఁ దెల్లవారి నలుదిక్కుల దినకరుని కిరణములు ప్రసరించుటచేఁ జీకటివేళఁగల్గిన యనుమానములెల్ల పఱచి నా మనమున కెంతో శాంతస్థితి కల్గినది. ఔరా ! మానవదేహాముపై ప్రభాకరునకు గల యట్టి ప్రభావము !

ఉదయమున నిద్రమేల్కనఁగనె నాకు లభించిన శుభశకునము నిష్ఫలముకాలేదు. తొమ్మిది కొట్టకమునుపె జాబుల వాఁడు తమ ప్రియలేఖను దెచ్చి నాచేతఁ బెట్టెను — బండిఁగోఁ కదలుచు మీరు లిఖించిన వంకర టింకరల లేఖ — ఆహా ! యీ గీట్లును గీతలును నామది కెంత ప్రియము గావించు చున్న యవి !

అట్లే, హృదయప్రియా! మీరు చెప్పినచొప్పున నేనడచు కొనఁ బ్రయత్నింతును. కాని, యాఁడుదానఁగదా !—ప్రియ మొలుక మీరు పలుమఱు పలుకునట్లు పిల్లదానను ! మఱి, పసిపిల్ల—ఉపాధ్యాయులు చెంత లేక—తనంతట తాను పాఠము లెట్లు నేర్చుకొనఁగల్గును? అవియు ప్రేమవిషయక పాఠములు! అయినను తమమాటలు స్మరించి యొక్కింత మనోబలమును గొనియెద. ఇట్లు మన మొండొరుల నెడబాసి యుండుటకు

నామది యొప్పుకొనదు. కాని, యిప్పటికీ పద్ధతిమేలని విధి యించిన తమ వివేకమును లేశమును శంకింపను.

"ఒక సంవత్సరము మాత్రమే" — వీలుచూచుకొని అపుడపుడువచ్చి పోవుచుందును" — "నీ యట్టి యబలకు తగని ప్రదేశము" — ఔరా! మీ మాటలు నన్నప్పుడు సపఱచేఁగదా! నాపై మీ కెట్టి యద్భుతశక్తికలదో చూచితిరా! కాని,యిప్పుడామాటలు నామదికి సూటికావు. తాము విధించిన విధిగా—తమ చిత్తమునకు ప్రియమైన గూర్పవలెనని — మాత్రమె ఆమాటల నిప్పుడు నేను పాటించెదను.

ఇచ్చట,పుట్టింట నుండుట కొప్పుకొంటినిగదా. మీరు దయమీఱ పలికినయట్లు నా తలిదండ్రుల సంతోషమును కోరి కాదుసుమండీ!—మీ ఆజ్ఞప్రకారము! తలిదండ్రులపై నా కపేక్ష కలిగియుండుట నిజమే. వారు నాకు రక్తసంబంధులు—ప్రియులు. కాని, వారికంటె మీరు సామీప్యలును ప్రియులునై తిరి — ఆహా, యేమిమాయ! ఎట్టిమార్పు! ఈ రెండు సంవత్సరములలోపల!

ప్రియవరా! నా ప్రేమను బంధించుకొని, అనుదినము మీకుజాబువ్రాయుచు అప్పటప్పటికి వెలువడు విశేషములు తెలుపుచుందుమని నాకు సెలవిచ్చితిరి. కాని యింకను నా ప్రేమాశ్వమును నిలువఁద్రొక్క నేరక యున్నదానను. కావున నింతట విరమించియొక్కింత తడవు వీణ వాయించుకొనియెదను.

## 3-వ లేఖ.

మనోహరా!—సోమవారము మొదలుగ నెక్కడ శక్తియేని తమ కనుపనైతిని—ఏలనో యూహింపఁగలరా? నేఁడు గూడ నటులే చేయ నిశ్చయించుకొంటిని గాని, నా మౌనమనుమానము గలిగించి తమ మనమును కలవరపఱచునని వెఱచి యీ జాబు వ్రాయఁబూనితిని. ఆత్మసఖా! ఆవంతయేని అవిధేయత తాల్చినదాననని తలంపకుఁడు. అవిధేయగ నెందును ఎన్నడును వర్తించినదానఁగాను. ఇక ముందును వర్తింపఁబోను. అన్నిఁట నత్యంతవిధేయనై-తమ చిత్తవృత్తి చొప్పున తమయాజ్ఞ చెల్లించుటయే నాకు బ్రహ్మానందము. కాని, ఆడుదానను నాకు మీ మగలకుఁగల సామర్థ్యమున సగపాలేని ఉండఁజాలదు గదా!

ఈ నాల్గుదినములనుండి నే నంపించనిజాబుల కబ్బినగతి దీనికి ప్రాప్తించిన నిది యైదవజాబుగ నేర్పడును. ఇంతకు నా తప్పొక్కింతయు లేదు. నాతలఁపు లీడ్చినయట్లు లేఖ లిఖించి మఱిమఱి చదివి చూచుకొందును. అందగ్ని యధికముగఁ గన్పట్టినచో దాని నగ్నిప్రీతి గావించి యానాటికి మఱి లిఖియింపఁ బ్రయత్నింపను. ప్రియరమణా! విరహాగ్ని నణఁగఁ ద్రొక్కుకొని నానాఁటి యోగక్షేమవిశేషములు మాత్రము లిఖించునట్లు చెప్పియుంటిరి—కంటిరా మీ యుపదేశఫలము! అది యెట్టిదైన మీయానతి నెఱవేర్చుట విధిగదా!

ఏదేని శరణాలయమున కంపించఁదగిన స్థితియందున్న దానననని ఈమాటలవలన తలంపకుడు. ఏమో యెవరెఱుఁగుదురు అదియు లభించునో యేమో? మీదయవల్ల! ముందే వందనము లిడుదునా!

నిజముమాట— నే వ్రాసినజాబులు చదువుకొని నేనే నిలువనేరకపోతిని. వానిని మీకంపిన మీ చిత్తము భ్రమచెందునని వెఱచితిని. ఎన్నో పనులున్న మీ మనసు కలవరపడియె నేని, పాప మప్పుడు మీచేతఁ దగిలియున్న వారికెల్ల ముప్పు మూఁడుట నిశ్చయము గదా!

ఈ దినమున కింతచాలును. బాకీ మీప్రక్కనేయున్నది! మూటి కొక్కటి—హా! మీ రెన్నటికి నన్నుఁ గలియఁజాలరు!

## 4-వ లేఖ.

మనోహర ప్రియరమణా!—మీ ప్రేమలేఖ యిప్పుడ చేకొని అత్యంతానందమును చెందితిని. అది నా మనము నుండి యెంతో విచారభారమును తొలఁగించెను. ఊరికి చేరిన వారు జాబేల వ్రాయరైతిరని—మీరన్నట్లు పిచ్చియూహాల పిల్లను — పలుతెఱఁగుల తలఁచితలఁచి కలవరపడుచుంటిని.

మీ యుద్యోగమును మరలనిచ్చుటికి మార్చుకొనఁ జూచు నట్లు వ్రాసితిరే, అంత శీఘ్రము మది సిద్ధించునని నమ్మఁజాలను. లేక, మీ యాలస్యమునకు నే నాగ్రహాక్షిడకుండుటకై యీ

కలకండ పలుకు పంపితిరో! ఎట్లయిన నా సందేహా లాభ
మును మీ కిచ్చెదను – మీ యుద్యోగ విచారణలకు లో
నైనవారి విషయమున మీరు నిశ్చేష్ట చేయుదురుగద!

ఈ యుదయమున కొంతబడలి ఉత్సాహము తగ్గియున్న
దానను. నిన్నటిరాత్రి, చీఁకటిపడిన పిమ్మట, ఉన్నట్లె జ్వరము
తగిలి పండుకొంటిని. అప్పుడు మా తల్లియు తండ్రియు డా
క్టరుగారికి కబురంప వారును సిద్ధమై నా చెంత నిలువంబడిరి.
ఈశ్వర దర్శనము దుర్లభముగాని యమదూతలు పిలిచిన
పలుకుదురుగదా! ఈ డాక్టర్ల నెన్నడు నిష్టపడుదానఁగానని
మీ రెఱుఁగుదురు. ఎప్పుడు చూచిన వారిచూపులు మనుష్యు
లను మ్రింగునట్టివి. ఇంక, జ్వర పరిశీలనమునకును హృదయ
పరీక్షకును వా రుపయోగపఱచెడి గొట్టములో – వానిని
చూచుటకే వెఱతును. అయిదుగు రక్క సెల్లెండ్రు, గట్టపు
డాక్టరు – వీరి కథ విన్నవా రెవ్వరు వెఱవరు? – ఆ కథను
ఉత్పత్తిస్థానమునుండియే మన భారతివలన వింటినిగదా. మన
యాతడుమాత్ర మెన్నడు అంత శ్రమకలిగింపఁడు. అదెట్లు
న్నను రాత్రి ప్రదక్షిణములుచుట్టి మనయిల్లు సేరువఱకు
అతఁడు కడుబడలి యుంటచే నా నాడిమాత్రము పట్టిచూచి
నాలుగు పొట్లములకు చీటియిచ్చి నన్ను పోనిచ్చెను. ఇప్పుడు
చూచితిరా, జ్వరముపోయి యథాప్రకారమున్న దానను!
డాక్టరుగారికిచ్చు ద్రవ్యము దండుగకాదని వారిని మా తండ్రి
మరింత పొడుగుగఁ బొగడుచున్నారు. ఆ మందు పొట్లములో

ఆహా! అవి నా దసుకుపెట్టెలో నొకమూల భద్రముగ దాచఁబడి యున్నవి!

ఇస్సీ! ఈ మహాజ్ఞానులు తమ గొట్టముల కొకింతయు లోఁబడని జ్వరములకు మందియ్యఁ బూనుకొనుట! మీరు ఊరికి పోయినది మొదలు నేనే యొక జ్వరపరీక్ష గొట్టముగ నేర్పడి గడియ గడియకు పైకి క్రిందికి పఱచుచుంటిని! నా జ్వరము పరీక్షింపఁగల డాక్టరెవ్వరు? — మీరుతక్క!

ప్రాణప్రియా! త్రొక్కరాని త్రోవలయందు కాలిడితినా? అటు లేని ఇటనాగనిందు.

## 5-వ లేఖ.

"చక్కఁబడనిది సహించితీఱవలెను." అది యేల చక్క బడదు?—మఱి యెట్లు సహింపఁగూడును? ఈ సామెతె త్రిప్పి యుండవలెనని తలఁచెదను—"సహింపఁగూడనిది చక్కఁబడి తీఱవలెను." హృదయప్రియా! యిది మీకు కట్టుకథగఁ గన్పట్టుచున్నదా? అట్లని దానిని విప్పుడు—విప్పగల్గినచో! మీ సేవకురాలికి సంబంధించినదికాదు సుమండీ!

నిన్నటి మధ్యాహ్నము రంగనాయకి యిచ్చటికి చూడ వచ్చి రెండు మూడుగంటలు నాతో ప్రొద్దుపుచ్చెను. కొంత సేపు వీణవాయించి అటుపై మే మిరువురము ముచ్చటలు చెప్పుకొనఁ దొడఁగితిమి. ఆ మాటలలో నాపె మీ "క్రూర కృప" ను గూర్చి విస్తరింపుచుండ నే నొక ప్రశ్న యడిగితిని.

అది యడుగరానిదైనను అప్పుడక్కఱకు వచ్చి తత్క్షణము మా సంభాషణమును మార్చెను.

"ప్రియసఖీ! రంగా!"—నేనంటిని—"కోపము దాల్పకుమా, ఎన్నోసార్లు నిన్నడుగవలెనని యెన్నుకొని నోరురాక యూరకుంటిని. పసిదానవు గదా! యెందుకమ్మా నీసుందరమగు కురులు విడనాడితివి? నీవే కోరితివట గదా! పూర్వాచారపరులగు మీ తలిదండ్రుల బలవంతము కాదట—వలదనికూడ వారు బతిమాలిరట గదా!"

అంత నా మోటమాటలకు చింతించితిని. నా సఖిచక్షువులు అశ్రుపూరితములగుటకు సిద్ధమయ్యెను. కాని, తటాలున వారించుకొని ఆమె, యీ పగిది, మొగమోటము తెగనాడుకొని పలికెను. "కమలా! ప్రియా! నీ చదువు నాకు లేదని యెఱుఁగుదువు గదా! నా తలిదండ్రులు బీదలౌటచే విద్యగఱప నాకై యొక దొరసాని నేర్పఱచఁజాలరైరి. మీ—ఆడు పిల్లల పల్లెకూటముల కేని పంపి నన్ను చదివించరైరి. కాని, ఒక మాటవిను — దేవుని దయవల్ల నాకును కొంత జ్ఞానము కలిగియున్నది — ప్రగల్భపు పలుకని తలఁపకు, మీ సంఘసంస్కర్తల ప్రసంగములెల్ల ఒక్కపెట్టున గాలికి పఱచునట్లు చేయఁగలను జుమీ, సంస్కర్తలవి సంస్కృతులవిగూడ."

ఇట్టి ధైర్యపు వాక్కువిని నవ్వకుండుట దుస్తరమయ్యెను. కాని యెట్లేని నా నగవు బిగఁబట్టుకొని ఆశ్చర్యమును శంక

యుతిలకించునట్లు నా ప్రియసఖి వంకఁ జూచితిని.

"పురుషులు పురుషులే"—ఆపె మరల మాటాడఁదొడఁగెను—"స్త్రీలు స్త్రీలే. ఈ నీతి మీ నీతిపరులు మఱతురు. కాని, దానిని మాఱుపఱచ వారికి శక్యముకాదుగదా! పురుషులు చేయఁగూడినవి, తగినవి, అన్నియు స్త్రీలు చేయఁగూడునని, తగునని—తలంపరాదుగదా?"

"వితంతువులకు—ఎంత పసివారికిఁగూడ—వివాహము తగదన్న మాటా యిది?

"ఔను, అదే. మఱి—మన యిరువురిలో మాట—ఆ నీతికి వ్యతిరేకము నుఢువునట్లి, నడచునట్టి, స్త్రీ పురుషులను నేను కొనియాడను జుమీ!

"అది యట్లుల రంగా? వారేమి తప్పుచేసిరి? ఎందఱో చిలుకలవంటి పిల్లలకు పదియేండ్లేని నిండకమున్నె—ఎందఱకో అయిదాఱేండ్ల యీడులోపలఁగూడ—మనవారు పెండ్లి సేయుదురే, ఆ కట్టిన బాలున కాయువు నిండెనేని, పాప మా పసిబిడ్డ కలకాలము ముండమోపిగ జీవించియుండవలయుఁగదా!. తా నెన్నఁడు నెఱుఁగని—యిష్టపడి వరియించని—మగనిని, తలఁచుకొనుచు! అబ్బా! అట్టి బ్రతుకు బ్రతుకుట కన్న మడియుట కడుమేలుగదా!"

"వరి-యించని!"—నా స్నేహితురాలాశ్చర్యపడుచు ఒత్తి పలికెను. "వరి-యిం-చని మగఁడు! ఓహో! యిఁక ముందు మనపిల్లలు పెండిలిలేక పెద్దలై మగలకొఱకు మగ

వారిలో తిరుగుచు వారికడ పొగడొందుచు, పూజించి వరిం
చువారిలో దమవరుని నిర్ణయించుకొనవలెనని చెప్పుదువు
కాబోలు! సెబాసు! అట్లు ప్రేమాంధకార ప్రభావమువలన
చేకురు దాంపత్యములు అత్యంతసుఖదాయకములుగనుండ
నోపుఁగదా! ఇఁక నొకవేళ ఆవరములలో వారు పొరబడుదు
రేని వివాహబంధమును విడగొట్టవలయునని కూడ చెప్పు
దువు కాఁబోలు!"

"ఆహా!" యని యొక్కింతయు సంశయములేక పలికితిని.

"సరి! సరి! అది ప్రత్యేకము క్రొత్తపద్ధతి — తెల్లవారి
పద్ధతి. వారిదాంపత్యములలో నిజముగ సుఖప్రదము లెన్ను
న్నవో ఈశ్వరుఁ డెఱుఁగును. పై మెఱుపులు గని భ్రమ
చెందకు, కమలా! మెఱయునదెల్ల మేలిమికాదు సుమీ!
తెల్లవారు మన పద్ధతిని మెచ్చుకొనుటయు వినియుంటిని.
తమ నాగరికాచారములకు బలియై తమస్వేచ్ఛలకు బదులు
మన ప్రాచీనవిధులు గోరుకొనువారై యుండఁ బోలుదురు.
కాని, తెల్లవారికి—"

ఈ పట్టున, మేము కూర్చుండియుండు చావడిలోనికి ఆ
మీ అప్రాశ్యపరిచయుఁడు, ప్రగల్భరాముఁడు, తగదని తలఁ
పక తటాలున ప్రవేశింప ఆపె తనమాటలు నిలిపెను.

ప్రగల్భరాముఁడు లాయరుపట్టా సంపాదించుకొన్నది
మొదలు తానెద్దియో యూర్ధ్వలోకమునుండి దిగివచ్చినట్లు
తలంచుకొనుచున్నవాఁడుగదా! దొంగచూపులుచూచుచు

అబ్బురముగ నంకురించిన మీసపుమొలకలను మఱి మఱి లాగి త్రిప్పుచు అతఁడేమో గొణిగెనుగాని మాకది వినఁబడదయ్యెను. ఎవరినడిగినదికూడ తేటపడదయ్యెను. అతని దృష్టి అన్నిదిక్కుల ప్రసరించుటచే గోడలనో దూలమునో యడిగినట్లుగూడ భావించుకొనఁదగి యుండెను. గొణుగుడు ముగిసినపిదప నాతఁడు పోఁతవిగ్రహామువలె కదలక మెదలక నిలుచుండెను. తన యందచందములను ఆతఁడు తలఁపఁడు గదా! అవి తక్కువయని మేము కొనియాడవలెనని కోరెను కాఁబోలును!

ఏమియుఁదోఁచక కలవరపడి నేనుతలవంచుకొంటిని—ఇట్టి మర్యాదహీనమైన మద్ప్రవర్తన మెన్నఁడెఱుంగుదును? నా స్నేహితురాలు మాత్రము తెలివి తెచ్చుకొని తెగఁబలికెను— భార్య మృతిచెందిన యీ నాల్గయిదు మాసములలో నతఁడా పెను విడువక వేఁడుకొనుచుండినమాట మీరెఱుఁగుదురు గదా, సదుద్దేశముతోఁడనే యని యెన్నుదము.

"ఇచ్చట నెవరును పనివాండ్రుగాని మగవారుగాని లేరండీ"—నా స్నేహితురా లొక్కింతయు జంకులేక పలికెను—"మీరడుగునట్టి సమాచారము మాకు తెలియదు."

అవమానము చెందనివాఁడయ్యును—కొందఱి మనస్సుల కవమానమె తోఁచదు గదా!—విఫలప్రయత్నుఁడై మాఱు పలుకక ప్రగల్భరాముఁడంతట వెడలిపోయెను. పోవుటకు మునుపు ఆ మూడు నిముషములలో ఆరవసారి యాతఁడు

సారి యీతఁడు తన మీసమును త్రిప్పి తిప్పలు పెట్ట మఱచిన వాఁడు కాడు.

"ప్రియురాలిని వెదకుచున్న వాఁడు!"—అని చిఱునగవుతో పలికితి, నాతో ట్రుపాటు కొంత తొలఁగించుకొని.

"నిశ్చయమే - ప్రియురాలిని వెదకువాఁడె"—నా స్నేహితురాలు ఎత్తిపాడిచెను—"బ్రతికియున్నంతకాలమతఁడిట్లే ప్రియురాలిని వెదకుచుండుఁగాక! భార్య మృతిచెందిన పండ్రెండవనాఁటనుండి యీ నాలుగు నెలలకాలములో ఒకటే సారి నాల్గుచోట్ల నాతఁడు ప్రియురాలికై వెదకుట కారంభించి నెలనెలకు తనవయసు తక్కువగ చెప్పుకొనుచున్న వాఁడు!"

"ఊఁహూఁ! ఇది క్రొత్తవార్తగదా-వినవింతైనది. ఇన్ని దినము లేల నాతో చెప్పవైతివి? ఎట్లని అతఁడిపుడు తన నిశ్చయమేర్పఱచుకొన్నట్లు కానవచ్చెడిని. ఇంక నేడ్పించి—"

"వానిల్లు వెల్లువపాలుగాను! ఆ విధవమాట మన కేల పోనిమ్మా!"

"ప్రియురాలిని త్రోవలో నతడు పట్టుకొన్ననో?"

"ప్రియురాలాతని గొంతువట్టి గట్టిగ పిసికివేసిననో?"

ఇయ్యది వాటిల్లుటయు నాశ్చర్యముకాదని తలఁచితిని—వట్టి దురుద్దేశముతో నాతఁడీ తీఱున తిరుగునట్లందఱు చెప్పుకొనుచున్నారు గదా!

అటుపిమ్మట మునుపటి సంభాషణమందుకొని—"అయితే రంగా! మన పద్ధతియే మనకు ప్రశస్తమని చెప్పెదువు?"

"ఔను" — నా స్నేహితురాలు పలికెను — "అలాగే. కాని, మన పద్ధతిలో లోపములు లేవని చెప్పను — ప్రపంచమున లోపములు లేని దేమున్నది? ఈ మనజన్మమే లోపములతో నిండినది. లోకములో లేని — లోపరహితమైన — పద్ధతిని కోరుకొని వెతచెందుట యేమి వివేకము?

ఇట్లు పలికి యామె యొకనిముస మూరకుండెను. ఆమె వేదాంతమున యథార్థము ధ్వనించుటగని నేనెంతయుఁ దెల్లపోయి చూచితిని.

నా స్నేహితురాలు మరల మాటాడఁదొడఁగెను—"కొన్నియంశములలో మన పద్ధతియే మంచిదని చెప్పవచ్చును. ఎట్లందువో — ప్రేమించిన పురుషునిఁ బెండ్లియాడుటకన్న పెండ్లియాడిన పురుషుని ప్రేమించుట పెద్దగదా? అన్నదమ్ములు అక్కసెల్లెండ్రు, వీరివలెనే మనకు భర్తలును బాల్యమునందే యేర్పడుటచే వారెట్టివారైనను ఇష్టపడి వారిని ప్రేమించనేర్చుకొందుము. మనపుట్టుక పెంపులయందెట్లు తప్పదో అట్లే పెండ్లివిషయమునందును తలిదండ్రుల యేర్పాటులకు మనము లోఁబడఁదగును గదా? లోఁబడుటచేత నిందేమి యెక్కువ యిక్కట్టులుగల్గును? మఱియు మన వివాహము వట్టిస్నేహాబంధముగాక సర్వకాలమునకు దంపతులకైక్యము గలిగించునట్టి మతసంబంధమగు సంస్కారమని యెఱుఁగుదువుగదా?

"సర్వకాలమునకా!" యనుచు ఆశ్చర్యముతో పలికితిని. "భర్త గతించిన పిమ్మటఁగూడ! అటులేని, ఈశ్వరా! ముందువలె సహగమనము సేయుటయే మేలుగదా!"

"అటుగాదు" — నా స్నేహితురాలు వాక్రుచ్చెను — "అది వట్టి పిచ్చిపని. భర్త వెనుక భార్య జీవించియుండి అతని నిమిత్తము తన సౌఖ్యము మానుకొని కష్టపడుచు అతని యాత్మకు ముక్తి సమకూర్చుటకై ఆమరణము పుణ్యవిధులు నెఱవేర్చి తుది నాతనితోఁ జేరవలయును. అటుగాకున్న, నిస్సంశయముగ తొంటియాచారమే సర్వోత్తమము—ఇతర కారణములచే పరిపాలకులు నిషేధించిన సహగమనము."

"ఇందువల్లనా మన బాలవితంతువులకు వివాహము తగదని చెప్పుదువు?"

"ఔను — వారు మన మతవిధుల ననుసరించుచు మనలో నుండఁగోరినపక్షమున."

"అయితే, రంగా! ప్రియా! నీ మనసున కది విచారకరముగా, అవమానకరముగా, తోఁచలేదా — మన దేశములో ఇరువదిలక్షల బాలవితంతువులు! పదియేండ్లయీడు నిండని వారు! అకటకటా! వారు గడపవలయు జీవితకాలమెంత దుస్సహము!"

"విచారకము, అవమానకరము నంటివా? అట్లయిన, ఈడువచ్చిన పడుచులును పడఁతులును మగలకొఱకు వెదకుచు—తామే వరియించుకొను పద్ధతియైన నందఱును మంచి

మగఁడుకావలెనని వేఁచియుందురుగదా—ప్రాణము విసిగి తుదకే ముదుసలివానినె కట్టుకొని విచారముపాలగుటయు, లేకున్న పెండిలి లేని పేరక్కలై వ్యసనముతోడఁ గ్రుళ్లి చచ్చుటయు—ఇది విచారకరము, అవమానకరమునుకాదా? ఏదో విధమున స్థిరపడి యుండుటవలని తృప్తిసౌఖ్యమును స్థిరపడక చెలరేగుటవలని యనర్థమును నీవే పరికించి చూడుము! కమలా! సమస్తమును మన మరసి చూచుటలో నున్నది—మెఱయునదెల్ల మేలిమిగాదని యంటినిగదా!"

నానోట మాటరాదయ్యెను.

"మఱి—ఇంత విస్తీర్ణముగల మనదేశములో ఇరువది లక్షలు-ఇరువదికోట్ల స్త్రీలలో ఇరువదిలక్షలన్న నది యెంత పాటి?"

ఏయంశమునకును మాఱుచెప్పఁజాలక యెంత చదివినను చదువే చాలదని తెలిసికొంటిని. బండెడుగ్రంథములు పఠించినవారికన్న అనుభవదృష్టియు ఆలోచనయుఁ గలవారికి ఎక్కువ జ్ఞానము నిశ్చయము. ఇంక నామనసును బాధించుచున్న యంశమొక్కటే నిలిచి యుండెను. అది మా యీ సంభాషణమునకెల్ల మూలమైన నా సందేహము.

"రంగా!"—నే నడిగితిని—"సరే, నీమాటలెల్ల యొప్పుకొన్నను పాప మీ బాలవితంతువులు తమకురులేల యుంచుకొనఁగూడదు? ఏల వారలు కడుపునిండఁ గుడువక జీవచ్ఛవములపలె తమ బ్రదుకు చెల్లించవలయును? ఇదియు భర్త

యాత్మ కానందప్రదమా, లేక, వారిని దుష్పథములనుండి తప్పించుటకై యివి మన పెద్దలు నియమించిన నిర్బంధములా? రంగా! సఖి! నీ చక్కనికురుల యలంకారముతో నీవెట్టి యచ్చరచానవ లెనుంటివి! అయ్యో! అవి యేలవిడనాడితి వమ్మా?"

"ఛీఛీ! పిచ్చిదానా!" – యని చీవాట్లుపెట్టుచు నా స్నేహితురాలు పలికెను – "ఆ మాటలు మీ నూతనబోధకుల పిచ్చికూఁతలు గదా? కురులను బట్టి రూపమునుబట్టియు నా తరుణుల సుగుణము నిలిచియుండుట! అయినను కురులేల నమ్మా, వానిని గని యానందించఁగల పురుషుఁడు లేక అతని ముక్తి నిమిత్త మతని పేరుగ తాను బ్రతికియుండి పుణ్యావిధులు నెఱవేర్చవలసి యుండునపుడు?" – ఈ పట్టున నా నెచ్చెలి కన్నులలో నీటి బాష్పము లుదయించెను – "ఎందు కమ్మా ఆడుదానికందమును ఆభరణమును నాథుఁడు లేనప్పుడు? నాకురులును భూషణములును విడనాడినట్లే యీ రూపము గూడ మాపుకొనఁ గల్గిన నెంత సంతోషముగ కాలము గడుపుదును? ఇది నాకు దైవము విధియించినశిక్ష. ఇది లేకున్న నా బ్రదుకంతయు సంతోషముతో – ఇంతవరకు నే నెఱుఁగని నాథుని, నే పూజించెడి ప్రియుని, ముందు చూడఁగల్గుదునను సంతోషముతో – నిండియుండును గదా!"

ఆకడపటి పలుకుల కామె కన్నీరు గార్వసాగెను. నేనును నాజాలి నిలుపుకొనలేక పోతిని. నిశ్చయముగ, రంగనాయకి

వచియించిన నీతిని మించినదేమున్నది ?—" ఎందుకమ్మా ఆడు దానికందమును ఆభరణమును నాథుడు లేనప్పుడు ?"—ఆహా! దీనికంటె ప్రేమయు పతిపూజయుఁ గలదా !

మఱి కొంతసేపటి కాపె, మఱల శీఘ్రమె వచ్చి చూచి పోవుదునని చెప్పి, వెడలిపోయెను. అట్లుపోయి ఆపె మనవీథి తిన్నగా తిరుగకమునుపే, అతి సమీపములో విచిత్రమైన గడబిడ వినఁబడుటచే విచారమును ఆశ్చర్యమును కలిగెను— ఎవరో యెఱిఁగినవారిద్దరు నిరాటంకముగ తిట్టుకొనుచుకొట్టు కొనుచు నుండునట్లు కీచుగొంతు ధ్వనియు మొద్దుగొంతు ధ్వనియు కలిసిన గందఱగోళము.

ఇదిగో యిక్కడనే యీ పెద్దజాబు ప్రారంభమున సూచించిన కట్టుకథకు పుట్టుక. ప్రియవరా ! మీ బదులుజాబులో ఈ కథను విప్పుఁడు — విప్పి, మీ ప్రియురాలివద్ద మీ కిష్టమగు బహుమతిని గొనుఁడు !

## 6-వ లేఖ.

ప్రియవరా ! — ఇదిగో మీకు శుభవర్తమానము, అదియు మీ కిష్టమగు వర్తమానము ! చంచలకు సంబంధము నిశ్చయమైనది. ఆ గొప్పవారి కుమారుఁడే. పిల్లవానికి మూడు వేలు కట్నము - పిల్లదానికి మూడంతలు నగలు. జాతకములు ఎంతో వింతగ సరిపోయెనఁట—తక్కిన విషయములు సరిపోయినపుడు జాతకములు తప్పక సరిపోవుచుండుఁగదా ! మనుమరాలికి మంచిమనుము దొరికెననుచు ముసలాయన

మురియుచున్నాడు. ఈ దేహము నింక నిశ్చింతగ విడువఁగలఁడు! రెండువారములలోపల లగ్నము.

రంగనాయకి వేదాంత మిప్పుడుగూడ నాచెవులకు రింగుమని వినఁబడుచున్నది. ఆలోచించిచూడ నాపెమాటలెల్ల సత్యములుగఁ గన్పట్టెడిని. కాని, యీ పసి బాలికలకు — ముఖ్యముగ మన బ్రాహ్మణబాలికలకు — ఈడురాకమునుపే పెండిలిసేయవలసిన విధి నామనసును కలవరపఱుచుచున్నది. వట్టి శేరము, వేలముపాట క్రిందికి దిగినది గదా? లావణ్యాలత లీలకింకను సంబంధము నిశ్చయము కాలేదు. పదకొండేండ్లు నిండెనో లేదో ఆ చిన్నదాని వివాహమునుగూర్చిన ప్రస్తావమును ఆక్షేపణయు నడచుచుండని యిల్లేలేదు. ఇంకను పెండిలిసేయకయుంచెనని అమ్మలక్కలుచాటుమాటునతండ్రి నెత్తి పొడుచు చున్నారు. పాపమాయన కడుశ్రమపడి చదువునేర్పుచు తనపుత్రిక నెంతో ప్రేమతోడ పెంచుచున్నవాఁడు-ముందెన్నఁడో వృద్ధికిరాగలఁడనినమ్మి యాచిన్నదాని నెవ్వఁడేని బుడుతని పాలుసేయుటకు వెనుదీయుచున్నవాఁడు. గడచిన శుక్రవారమునాఁ డెవ్వరో ఒక గొప్పయుద్యోగస్థుని సంబంధము తెచ్చిరట. ఏబదియేండ్లు, మొదటిభార్యకైదుగురు బిడ్డలు, కావలసినంత భాగ్యము—ఈ సంబంధముమాట తెలుపఁగా ఆయనకు పట్టరానికోపమువచ్చెనఁట. నిక్షేపము వంటి సంబంధము చెరుపుకొన్నాఁడని ఆయన నెందఱో దూషించుచున్నారు!

నిజముగానే, ఎందుకొక చట్టము అమలులోనికి తేఁగూడదు—పదునాఱేండ్లు యీడునిండని బాలికలకు పెండ్లిసేయ రాదనియు, ఇరువదేండ్లకులోఁబడిన పడుచులకును ఏఁబదేండ్లు దాఁటిన మగలకును పెండ్లితగదనియు ఒకచట్టము? మన పరిపాలకులు మనమతాచారవిషయములలో జోక్యము పుచ్చుకొనఁజాలరని యెన్నఁడో మీరన్నట్లు జ్ఞాపకము. కాని, వారికిష్టమున్నప్పుడు జోక్యము పుచ్చుకొనుచునే యున్నారు. అట్టిచట్ట మమలులోనికి తెచ్చినను దానినితప్పించుకొనవచ్చుననియు మీరంటిరి. ఏచటనో కొందఱు బుద్ధిమంతు లీవిషయమున చట్టముని ర్థించి విఫలప్రయత్నులైరనిగూడ తెలిపితిరి. మీ చట్టముల గుట్టులు తెలిసికొనఁ బుట్టినదానఁగాను. కాని, ఒక్కటి నిశ్చయముగ నెఱుఁగుదును—ఏమూలనో యేదో గొప్పలోపమున్నది, దానిని చప్పున సరిచేయవలయును.

ఇచ్చట నీజాబు ముగించెద. ఇంక నొకపంక్తియేని వ్రాసిన ఎప్పటి త్రోవనుబడుదునని భయమగుచున్నది. రేపటి దినము జాబువ్రాయను. అన్ని దినములలో రేపటిదినము—అబ్బా! మీరు చెంత లేనిది నా బ్రదుకెందుకు!

## 7-వ లేఖ.

నా రక్షకదైవమా!—ఈ కెంపులగాజులంపిన మీ దయను మీ ప్రేమను ఎంతని ప్రేమింతును? సరిగా ఆ దినమే వచ్చి చేరునట్లు పంపితిరి! మీపనులలో నామాట తలఁచుకొనుచు

నా పుట్టినదినము జ్ఞాపకముంచుకొంటిరే! నాకు రవంతేని తెలియనీక యీ గాజు లీయూరనెకొన్ని తీసికొనిపోతిరే! — ఆహా మనోహరా! యీనిముసమున మీరిచటనున్న, మీకు నా పెదవులతో, నాహృదయముతో, వందనములిడక యుం దునా? అయ్యో! యిచ్చటనున్న — ఇచ్చటనున్నఁగదా!

ప్రియవరశేఖరా! మీరు నా చెంతలేమి నా చిత్తమును నమలివేయుచున్నది. మీ "పిచ్చియూహాల పిల్ల" కు మీ రేర్పరచిన నిర్బంధముగూడ మస్సహాముగనున్నది. అబ్బా! యీ నాహృదయ మీ లేఖినిమూలేమున ఈ కాగితమున కెక్కఁగల్గినచో నా కెంతభారము తగ్గును! కానీ, యెట్లని మీయాజ్ఞవెంబడినే ప్రవర్తించెద. నా యిష్టము వెంబడి గుఱ్ఱమును వదిలిన నది యెచ్చటి కీడ్చుకొనిపోవునో యేమై పోవుదునో మిమ్మెడఁబాసి మీకు లేకపోవుదునో యని భయ పడియెదను.

నిన్నటిదినము పిలిచినవారందఱు పేరంటమునకువచ్చి మమ్ము గౌరవించిరి. భారతి యొక్కర్తె మాత్రమురాలేదు— ఈ మధ్యను మగఁడు ద్వితీయము చేసికొన్నది మొదలు ఆపె యెవరింటికిని పోవుటలేదు. ఎంతో చక్కఁగ పాటలుపాడిరి. అందులో మన రిజిస్ట్రారుగారి కొమరితలు — అహా! వారి గంధర్వగాత్రము లెంత మనోహరముగ నుండెను! మీ చుట్టలస్నేహితుఁడు వినియుండిన బాగుండునని తలఁచితిని. ఆడుపిల్లల చదువును సంగీతమును గొప్పసేయని యాతఁడు

కూడ ఆ ముద్దులమూటలగు నక్కసెల్లెం(డ్రను తప్పక కొని యాడి యుందును.

ప్రగల్భరాముని సిగ్గుమాలిన మడ్డిప్రవర్తనము జ్ఞాపకము వచ్చుటచేత మగపురుగు లోపలికిఁ జొరబడకుండ వీధివాకిట కావలియుంచితిమి.

మఱి — మీ జంభాలరాయని చెల్లెలు పెండ్లిచేసికొనుట కై వితంతు మఠమునకు పోయెనని చెప్పుకొనిరే - అది వట్టి అబద్ధపువాడుక యట. నిన్నటిదిన మాపిల్ల తల్లితోఁగూడ విచ్చుటికి వచ్చెను. పాపము! పదునారేండ్లు తిన్నగ లేవు. ఇంత చిన్నతనముననే ఆ చిన్నదాని కిట్టిదురవస్థ తటస్థించుట తలఁచుకొన కడుపు చెక్కలగుచున్నది. ఇంక, నా చిన్నది శుభకార్యములకు పోవుట మానదని దుష్టులుఁ పుట్టించు దుర్వాదుకలకేమి తక్కువ? విడనాడనొల్లని ఆ యందపు కురులుకని ఆచారపరు లోర్వఁజాలరుగదా!

అమృతదేవుఁడుగారి భార్య సంతానముకొఱకు అశ్వత్థ ప్రదక్షిణములు చేయుటగని నవ్వితిరి జ్ఞాపకమున్నదా? అది వట్టివెఱ్ఱి, మూఢభక్తి యంటిరి — మఱియేమైన నంటిరా! ఇప్పుడేమందురు — ఆమె యిచటికి అక్కగారింటికి పురిటికి వచ్చియున్నది! ఇంక రెండుమాసములకు కానుపని చెప్పు కొనుచున్నారు!

నా కింకను బడలికగా, నిరుత్సాహముగానే యున్నది — నిన్నటిరాత్రి తలఁపులకును స్వప్నములకును ఫలము! అన్ని

యు సంతోషకరమైనవే; కాని, తుది నెంతో సంతాపము నకు కారణములు !

## 8 వ లేఖ.

సముద్రతీరమున నేటియుదయ మెట్టి చక్కని సంబరము చూచితిమి! దినకరుని శరీరము ముప్పాతిక పాలు భుజియింపఁ బడ నాతని వెలుఁగు చల్లఁబడి వెన్నెలవలెనుండెను. అంతయు గంభీరిమతోనిండి భక్తిబోధకముగ నుండెను. ఎట్టి నాస్తి కుఁడును ఆశ్చర్యమగ్నుఁడై కేల్మోగిచి మ్రొక్కియుండును.

దివాకరనిశాకరులు చేసినపాపములకు శిక్షగ వారిని అప్పటప్పటికి రాహుకేతువులనెడి సర్పరూపగ్రహములు కఱచునట్లు సృష్టికర్త నియమించెనని మన పురాణములు చెప్పుచున్నవిగదా—యీహిందూ సర్పములు మీ యింగ్లీషు వారి ఛాయలకు మాఱుపేర్లుగనుండనోపును. కాని,యీరెం డునుగాక నిజము వేఱయినట్లు నా మదికి స్ఫురించెను.

నా రహస్యమును తెలుపుదునా? తెలిపినచో నవ్వి "పిచ్చి యూహాలపిల్ల" నని స్థిరపరతురో యేమో? సర్పములును ఛాయలునుగూడ పరస్పరప్రేమకు మాఱుపేరులని నాకు తోఁచుచున్నది. అన్యోన్యప్రేమచే స్త్రీపురుషులొండొరు లను గ్రమింగుట యెఱుఁగమా? మఱి—దినపతి తనరాణిని నిశాపతి తనరాజును—ఎన్నటికో సిద్ధించెడి సంయోగము గనుక అత్యంతప్రీతితో—గ్రమింగునట్లు ఏల యెంచఁగూడదు?

మిమ్ముఁ దలంచుకొంటిని—ఘనమై గంభీరమైనది యెయ్యది

చూచిన మీరు తలంపునకు వచ్చెదరు గదా! ఆహా! ఎట్టి భీకరదండధరుఁడును భామిని ప్రేమఁదగిలి దయగలిగి మార్దవము దాల్చుఁగదా! భామినియున్న ప్రేమతక్క మరియేమున్నది — మగవారి నానందంబున ముంచి తేల్చి తేజోమయులఁగావించి గారవించి ఘనులఁజేయు జీవామృతపూరితమగు ప్రేమసాగరము!

ఇంకను నాకు బడలిక గలిగియుండుటచే నేఁటియుదయమింట నె నిలువనిశ్చయించుకొని పొగచూపినయద్దపుముక్క సిద్ధముచేసికొంటిని—ఒక పెద్ద యద్దపుబిళ్ల నీ పనిలో పాడు చేసి. కాని, మేమంద్రరము సముద్రతీరమునకుఁ బోవునట్లు ఏర్పఱచి మాతలిదండ్రులు బండి రప్పించిరి. సదయాత్ములు ఉత్సాహమువలన నాహృదయమున మఱిత వంత యేర్పడునని వారికి తోఁచదయ్యెను. వారి యౌవనకాలమున ఏకష్టమును గలుగకయుండెఁబోలు. వారిసుఖప్రవృత్తి యిటునటు పేడదారినిబడి విడక వేరువడక ఋజుమార్గమున వర్ధిల్లినదో?

ఒడ్డువద్దికి గుంపులో పలికి నడచిపోతిమి. సముద్రతరంగములు రౌద్రాకారమునుదాల్చి, యీ పుణ్యకాలమున తమ నడుమఁజొరఁబడినవారిని చొరఁబడ నెంచుచుండువారిని అందఱనొక్కపెట్టున ఊడ్చుకొనిపోవుటకై ముందుకు దుముకుచుండెను. చూచువారి కంతయు నెంతో భీకరముగనుండెను.

ఉత్తర దక్షిణములు ఒకమైలు పొడుగున జనులు గుంపుగూడియుండిరి. కాని, వారు ఎన్ని వేలమంది యుందురో,

వారిలో నెందఱు స్నానముచేయవచ్చిరో యెందఱు వేడుక
చూడవచ్చిరో యెవ్వరు చెప్పఁగలరు? చాలదూరమున రాజ
ఘాటయందున నొక ఫొటోగ్రాఫు యంత్రమువాఁడు పటము
పట్టుకొనుటకై తంటాలు పడుచుండెను. బొమ్మలగుత్తులు
వ్రేలఁగట్టిన గడలచ్చటచ్చట నగుపడుచు వానిని మోయు
వారు గుంపులో కనుపడకయుండిరి. ఎచ్చటజూచిన పెక్కం
డ్రు బిచ్చగాండ్రును ముష్టివాండ్రును—కొందఱు కూర్చుండి,
కొంద ఱిటునటు తిరుగుచు, పాడుచు, జేగంటవాయించుచు
—కంప్టఁబడిరి. పడమటికి తిరిగి చూతుఁగదా, కొంతదూర
మున నిద్ద ఱైరోపియనులు గుఱ్ఱములపైనెక్కి వానిని ప్రక్క
ప్రక్కలనె మెల్లగ నడపించుచు ఒకచో నాగుచు మఱొక
చో మాటలాడుచు వేరొకచో మరలుచుండుట గంటిని.
వారిలో నొకరు దొరసాని యని గ్రహించి, వారికబ్బిన
యఖండసౌఖ్యమును నా యేకాకి విచారమును తలపోసి
మూర్ఛితురాలనై పడిపోవుటకు సిద్ధమైతిని. అప్పుడు మీా
లాయరుపండితులు నన్ను రక్షించిరి! తలవని తలంపుగ నతఁ
డచ్చటఁ గనుపడి యంతలో నంతర్ధాన మగుటవలనఁ గలిగిన
విస్మయపరిహాస భావములలో నావిచారము మునిఁగిపోయె
ను. ఏఁబది గజములదూరమున ప్రగల్భరాముఁడును అతని
వెంట ఆ సర్వజనమిత్ర మత్కుణము మహీపతియు వచ్చు
చుండిరి. కాని, వారేయని నే నిశ్చయపఱచుకొనుటకు
మున్నె ప్రగల్భరాముఁడు మా తండ్రి నొక ప్రక్కనుండి కని

యాపట్టున మరలి యాతని గడుసుస్నేహితుఁడెంత వెనుకకు లాగినను నిలువక వడివడిగ పరచి మాయమయ్యెను!

ప్రపంచమునందెల్ల ఈ ప్రగల్భరాముఁడె పరమాప్రా శ్యుఁడుగా నుండినను, ఆ సంకీర్ణసమూహములో సహస్ర మప్రాశ్యప్రగల్భులు లేరని యెవ్వరు చెప్పఁగలరు?

అంత నొక్కింతసేపటికి పరిహాసభావమునుండి మరల విచారమునఁబడితిని. ప్రగల్భరాముఁడు మాయమైన మఱు నిముసము కడలివైపునకు తిరిగి చూతునుగదా, పరమా నందప్రదమై అత్యంత సంతాపకరమగు విషయమొక్కటి కన్పట్టెను. అరువదేండ్ల ముదుసలికోఁతికి కట్టిన పదునా రేండ్ల బాలయప్సరస ఆయలలనుండి వెలువడెను. పరిమితి లేని తన భాగ్యమునీయ తనయునిఁగోరి యాతఁడీ నడుమ పెండ్లియాడెనని వినియుంటిని. లేకున్న నాతఁడా చిఱుతు కకు తాతయని తలంచియుందును.

తడిసి యొడలికంటిన తెల్లని దువ్వలువనుండి వెలువడు నాకృతితో, విరిసిన వెంద్రుకలయందముతో, గడగడ వడఁకుచు నిలువంబడిన యా సుందరవిగ్రహమును గని కడలి కన్యకయో యని భ్రమిసితిని. అట్లు భ్రమిసి, యీ యాడు జన్మమేల యెత్తితినని యొకనిముసము — ఒకటే నిముసము — వగచితిని. మఱునిముసమున ఆ చిన్నదానిపై జాలిగొని — మున్నెన్నఁడు నేవిషయమున నింతజాలి యెఱుంగను — రంగ

నాయకిని తలఁచుకొని నాలో నే మొరవెట్టితిని — "రంగా! ఎచ్చటనుంటివి?"

మనఃపతీ! నాతప్పిద మొప్పుకొంటిని. ఈ నాపాపము— నాచేసిన యీయొక్క పాపమును — మన్నింపరా? భువిఁగల సర్వైయిశ్వర్యములు నా కొసఁగినను ఇట్లుగాక నాకు వేఱు పుట్టుక కోరుకొందునా? కోరుకొనను — అయ్యో! యెన్నఁడు కోరుకొనను! నా పుట్టుక వేయైన మీ పొందుభాగ్య మబ్బి యుండదుగదా! మీపొందు—ఆహా! మీపొందును మించి నది మీ పొందేకదా!

నాథా! నా పాపమున కేమి తపస్సు నియమించెదరు? నేటియుదయము సముద్రముకడమంత్రోపదేశములు గొను చుండిన వారివలె నొంటికాలిపై నిలిచి తమ మధురనామ మును పదిలక్షలు జపము సేయుమందురా? చేయుమన్న సం తోషముతో, నెంతోసంతోషముతో, చేయుదును — మీ నామము ప్రియదైవము కృష్ణుని నామమెకదా! నాథా! అ య్యో! మనమెప్పుడు కలియుదుము!

## 9-వ లేఖ.

ప్రియనాథా! — బుధవారమునాటి మీ లేఖ యిప్పుడే చేరి నది. మీ విప్పినచొప్పు సరికాదు—మీకు బహుమానము లేదు! ఆకథ రంగనాయకి విషయముకాదు, ఆపెను వేధించు వరునకు సంబంధించినదియుఁ కాదు.

ఇప్పుడది ప్రాతసోదెయైనది. అదంతయు వ్రాసి మిము విసిగింపనొల్లను. ఆ గడబిడ మనే పొరుగింటి కోదండము గారి యింటఁ బుట్టినది. కోదండముగారేమొ ఫలాహారవస్తువులు బాగుండక కినిసి వానిని దన పెండ్లము మోముపైఁ బార వేయఁగా ఆపిల్ల అవమానము సైఁచనేరక వాని నినుమడిగ నాతనిపై ద్రిప్పివేసెనఁట. మీఁదు మిక్కిలి కుక్కవలె నరచుట కూడదని పెనిమిటిని దూరెనఁట. ఒక చెంపపెట్టు, తన్ను — అంత నా యబల పెద్ద యరుపరిచి క్రిందఁబడి మూర్ఛిల్లెనఁట. పాపమిప్పుడాపె యోపలేనిదై యుండుట యెఱుఁగుదురుగదా.

ఈ చుట్టుప్రక్క యమ్మలక్కలందఱు ఈ విషయమును గూర్చి మఱిమఱి భాషింపఁదొడఁగిరి. ఇఱుప్రక్కల నభిమానముతోడ వాదించువారును గొరవడసైరి. పెద్దలందఱు పాపమా చిన్నదానిదే తప్పనిరి. "మగవానికి వేయిపనులుండును - అతఁడు కడుబడలి యింటికివచ్చువేళకు నోటికి రుచియైన పదార్థముగానక ఒకవేళ తిట్టినఁదిట్టుఁగాక, కొట్టినఁ గొట్టుఁగాక - ఆడుది నోరుమూసికొని యుండవలెఁగాని, మారాడి చెంపపెట్టో తన్నో సంపాదించుకొన్న నెవ్వరి తప్పిదము?" అని పలికిరి.

మాయమ్మయు నిట్లే పలికెఁగాని ఆపె యభిప్రాయము నే నొప్పుకొనఁజాలనైతిని. అతడు వట్టి ముక్కోపి, యింతకు మున్ను గూడ నిట్లే దుడుకుతనము సూపెననియుఁ దెలిపితిని.

తెలిపినను ఆపె తన యభిప్రాయమును మార్చుకొనక చక్కఁ
బడనిది సహించి తీరవలెనని వ్రాకుచ్చెను. నేను మాత్ర
మాయబలపై జాలిచే నాపెపక్షము విడఁజాలక ఆ సామితె
త్రిప్పియుండవలెననితలఁచెదను. "సహింపఁగూడనిదిచక్కఁ
బడి తీరవలెను." ఇదిగో యిదే-కథ, విప్పు, అంతయు నిదియే.

చంచల వివాహమునకు మీరు వచ్చునట్లు వ్రాసితిరి.
రాకయునుందురా! ఏమో, నా సంతోషమునకు విఘ్నము
కలుగనున్నదో యేమో!

## 10-వ లేఖ.

ప్రియ శేఖరా! — నేఁటిలేఖలో కొన్ని పిచ్చిమాటలు లిఖి
యింతును, క్షమింపవలయు. నా మనస్సెల్ల వానితో నిండి
యున్నది — వెలిపుచ్చక హాయి తోఁచదు.

రాత్రి యొక కల గంటిని — తామిచ్చుటకి వచ్చి తమ కర
పల్లవములలో నేనిమిడియుంటి నఁట! ఎంతో బ్రహ్మానందము
గా తోఁచి నా సంతోషమును పట్టఁజాలక బిగ్గరగ నేడ్చితిని.
ఎట్టిదుఃఖమునఁదగిలినవారును నిశ్చయముగానంత యేడ్వరు.

ఆద్యంతముల కైక్యము కలదని చెప్పుదురు - కాని యె
న్నఁడు ఆమాట సూటి కనిపెట్టినదానఁగాను. ఓహో! నా
యశ్రువుల యానందము! అపారమగు దుఃఖమునవలె అత్య
ధికమగు సంతోషమునగూడ కన్నీరు కడవలుగ కారుట —
యిది యేమివింత!

ఇదిగో యిచ్చటనే నాపిచ్చి యూహాలు ప్రారంభించెడిని. ప్రేమయు ద్వేషమును ఎన్నఁడేని చేరియుండునా? ఈ రెంటికి నెన్నఁడేని ఐక్యము కలదా? ప్రేమించుచు ద్వేషించుటయు నెవ్వరికేని సాధ్యమా?

సాధ్యమనియే తలఁచెదను. అగాధమగు అనురాగాబ్ధిని అనుమానబీజము నెలకొని మొలకెత్తి విద్వేష విషమూలిక గా నేర్పడుచున్నది గదా! ఆ యంబుధి యమృతము చవి చూడ, ఆహా అది నిశ్చయముగ స్వర్గమే కాని, యామూలిక సాలుకకు తాఁకినచో నరకము వేఱు లేదు! ఇది యేమివింత— స్వర్గము, నరకము, ఒక్కచోట!

ప్రాణప్రియా! మిమ్మెన్నఁటికేని నేను ద్వేషింపఁగలనా? నన్ను మీరెన్నఁటికేని ద్వేషింపఁగలరా? అయ్యో! వలదు- ద్వేషింపవలదు. ఎన్నఁటికి నాయందు ప్రేమయె నిలుపుఁడు. ఎన్ని తప్పులున్నను నన్ను ప్రేమింపుఁడు. మీపై నే నిలిపిన ప్రేమలో సగపాలు నాయెడ నుంచుఁడు — మిము మించిన ప్రియపురుషు లీ లోకమున నుండరు!

ఇష్టమేని నను గదిలోఁ బెట్టి తాళము వేసికొనుఁడు, కాలు సేతులు కట్టివేయుఁడు. కాని, ఎన్నఁటికి నాయందలి ప్రేమను విడనాడకుఁడు—ఇంకను మిము పదిమడుంగు లెక్కుడుగ ప్రేమింతును. మీ చేతికట్టు శిరమున బిగియించి నను మీ వెంటనె కొనిపోవుఁడు! ఉంగరముగఁ జేసి యెల్లప్పుడు నను మీ వ్రేలినె ధరియింపుఁడు!

శర్మగారినిగూర్చి యెట్టి యపవాదము వాడుకలోనున్నది ! ఆయనకును భార్యకును ఆవంతయు నన్యోన్యానురాగము లేదని చెప్పుకొనుచున్నారు. కారణము — అయిదారు దినములలో మరలివత్తునని యెంత వేడుకొన్నను ఆలును పుట్టింటికిఁ బోనీఁడఁట. జాఁగాక, ఒకదినమేని ఆపెను విడిచియుండనోపనని యాతఁడు చెప్పుట లేదా ? ఆ చిన్నదానిని భద్రముగ నొకగదిలోనునిచి తాళము వేసికొనక యాతఁడిలు వెడలఁడని మీ రెఱుఁగుదురుగదా ? అది యేమి—ప్రేమగాక ! నిశ్చయముగా, తన ప్రేయసిని విలువలేని మాణిక్యముగఁ దలంచి గదా యాతఁడిట్లు గావించుట ! అందఱు నాతనిది వట్టి యనుమాన ప్రకృతియని చెప్పుకొనుచున్నారు. నేనది యనురాగమందును. ఒకవేళ అనుమానమును అనురాగమును ఒక్కటిగ నుండఁబోలునా !

నామతి కలవరపడుచున్నదా ! అటులేని నన్ను పిచ్చిపిల్లయని పిలువఁడు-కాని నాయెడ ప్రేమమాత్రము తప్పకుఁడు. నన్నెన్నటికి మీ స్వంతముగ, సర్వస్వతంత్రముగ, ప్రేమింపుఁడు !

## 11-వ లేఖ.

మఱల ప్రేమవిషయమే ! అదియు నసామాన్యమైన ప్రేమ— బ్రదికియుండువారిపై చచ్చినవారికిఁగల ప్రేమ ! మఱియెవరో కాదు, మన భారతి చెల్లెలు — గడచిన సంవత్సరము వైధవ్యము ప్రాప్తించిన బాలమ !

ఆ పిల్ల కిప్పుడు దయ్యముపట్టియున్నదఁట! మగఁడేయని చెప్పుకొనుచున్నారు. పాపము! పెండ్లాముతో కలిసి కాపురముచేయఁబోవు కాలమున కాతఁడు మృతిచెందెను. ఆ పిల్లను కన్నులారఁజూచి ఒక్కమారైన మాటాడనీయ్యక పోయిరి — యిప్పుడాకసి దీర్చుకొన నాతఁ డామెవెంటఁ దగిలియున్నాడు! ఆహా యెట్టి దురాచారము! అవి యేటి పిచ్చి మాటలు! ఆలుమగలను కలిసి మాటాడనిచ్చిన నందఱు వెక్కిరించియుందురు - మాటాడనియ్య లేదని యిప్పుడు నిందించుచున్నారు!

ఇచ్చోఁగూడ ప్రగల్భరాముఁడే యుండవలెనా! సిగ్గుమాలిన మొండిశిఖండి — పెండిలియాడు పడుచుగాని బాలవితంతువుగాని యెచ్చటనుండు నచ్చటనెల్ల ఈ ఛండాలుఁడు గన్పట్టుఁగదా! రంగనాయకిచేత చెంపపెట్లు తిన్న వెనుక ఆతఁడు తనయింటి చేరువనె యిల్లాలికై వెదకుకొనసాగెను. నాఁటనుండియె యీ పిశాచపుబాధయు ప్రారంభించెను. ప్రపంచమెల్ల నొకఁడే యిరుసున తిరుగుచున్నట్టు గన్పట్టెడిని!

పాపము! బాలమకు ప్రాప్తమైన దురవస్థ! దూరముగనుండు గదిలోనొండె దొడ్డిలో చెట్టుక్రిందనొండె ఆమె యొంటరిగ రాత్రి రెండుజాముల వేళ మాంత్రికునితో నుండవలసి వచ్చినదఁట. ఆమె కది యిష్టమేయఁట! దయ్యపుబాధ దానితో కొంతకాలము వఱకైనను తగ్గియుండునఁట! మాంత్రి

కుఁడుపోవ మాంత్రికుడు! — అబ్బబ్బా! యీ కొద్దిదినముల లోనే యెందఱైరో చెప్పఁజాలను.

ఈ దయ్యము తల్లివల్లఁ కలిగినదని చెప్పుకొనుచున్నారు. పడుచు విధవకు తల వెంట్రుక లేల? అవి చక్కఁగ చెక్కి జడ వేయ నేల? ఆషరుసను సుఖముగ తిని పెరుఁగుచు మంచిమంచి వలువలును నగలును ధరియించి సొగసుకత్తెవలెఁ జూపట్టిన చచ్చినదయ్యము లెకాదు బ్రతికియుండునవియు వెంటఁబడుట కేమి సందేహము? * * ఆక్షేపణల కంతె మెక్కడిది? మఱి, యీ ఆక్షేపించువారిలో ముఖ్యురాలు ఆ దొడ్డ యిల్లాలు అమృతదేవుని భార్యగదా! తన వెనుకటి సంగతి యామె మఱచిపోయినది కాఁబోలు—తననుపట్టిన భూతములమాట, బూటకపు భూతములనికూడ చాటుచాటున చెప్పుకొనిరి! పెనము వచ్చి మంగలమును వెక్కిఱించెనఁట — నల్లనిదాన వని! — లోక మీతీఱున నున్నది.

పాపము, తల్లిమాట తలఁచుకొన జాలి యగుచున్నది. కూఁతులకు దురవస్థ తటస్థించుటకన్న తల్లి కెక్కువ దుఃఖ మేమున్నది? ఇంట విచారము, వెలుపట వెక్కిఱింతలు అపవాదములు! — ఆపె కెంతో తలవంపులుగ నున్నది. అయిన నాపె ధైర్యముగలదే — భారతిని మరల నత్తింటికంప లేదు. ఒకయాలుగూడ అక్కఱలేని ఆ మగఁడుకుంక మఱియొక యాలును గట్టుకొన్నది మొదలు భారతి తల్లివద్ద నేయున్నది.

ఈ విపరీత వివాహపుమాట విని అందఱు నాశ్చర్యపడి యున్నారు. కారణము మీకు తెలిపితినా? — యిప్పుడు వెలికి వచ్చినది. చిట్టి భారతిని ఏడేండ్ల యీడుననె తలిదండ్రులు ధన పిశాచమునకు సమర్పించిరి. ఇప్పు డా ధన పిశాచముయొక్క తల్లికి భర్తృవియోగము వలన స్వాతంత్ర్యమలవడి ఆ ధనము తనవారికె చెందుటకై ఆ పిచ్చికుంకకొకపిల్లను — తనతమ్ముని కూఁతును — మరల ముడివెట్టినది! భారతి తలిదణ్డ్రులయు బంధువులయు దురాశయెన్నికలు ముసలిదానిగడుసు తనేముచే పడిపోయినవి. కప్పలపై ఱాలు ఱువ్విన బాలురకథ స్వామితే యేర్పడినది — పైవారికాట, పడువారికి ప్రాణాపత్తు. అక్కటకటా! ధనపిశాచమునకు రెండు ప్రాణములు బలియా! — ఆ యొప్పుల కుప్ప భారతి గతిని తలంచి కన్నీరు గార్పని వారెవ్వరు?

ఆపె తలవ్రాలని యందురు గదా! నిజమే, తప్పనేరని తలవ్రాలు—ఎట్టి దుష్కార్యములను సరిపరచునట్టి మన హిందూ వేదాంతపుమూల మంత్రము. చూచిచూచి చేతులార గొంతుకోసి తుదకు తలవ్రాలని సమాధానము చెప్పుట! భళిరే! దీనిని నిందించిన న్యాయమేమున్నది! ఆ తలవ్రాలు భారతియెడ నొక్కింతయు నక్కటికము లేక యుండవలెనా! మీ "లా" ప్రకారము భారతిని భర్తయొద్దనుండునట్లు బలవంతము సేయ వచ్చునఁటగా!—అతనికిని తల్లికిని చాకిరిచేయుటకు! — ఉండకున్న చెఱసాలకు బంపఁగూడునఁట!

చెరసాలా ! ఓహో ! ఎచ్చటనున్నారు మీ చట్టనిర్మాణకులు ?— రేయుంబవళ్లు నిద్రచెడి, వేలకొలఁది విత్తము వెచ్చపెట్టి యేజెంట్లను మధ్య మనుష్యులను పురికొల్పియు, తాము బతిమాలుకొనుటగాక తమమిత్రులమూలమునను మిత్రుల మిత్రుల మూలమునను మిత్రుల మిత్రుల మిత్రుల మూలమునను సిపార్సులు జాబులు తంతులునంపి నేమించువారి ప్రాణములుతీసి "ఆనరెబిల్" మహాత్పదవిని సంపాదించిన పెద్దలెచ్చటనున్నారు ? ఇయ్యదిగూడ వట్టినాటకమేనా ? వీరును బిరుదులు పేర్కోరునట్టి సమయోచిత ప్రవర్తకులేనా ! జౌనని యెట్లు తలంతును ?—వారిలో కొందఱు "ఆనరెబిల్" బిరుదు లేకుండియు పూజ్యులెయని నే నెఱుఁగుదుఁగదా ?

భారతి నిశ్చయముగా ఆ తల్లికూఁతు రే—ఏమిరానున్న ను స రే, మగనివద్దికి మరి పోఁజాలనని స్పష్టముగా తెగఁజెప్పినది. ముగ్గురు లాయర్లు — వారిలో నొకరు ప్రసిద్ధిపురుషుడు—ఆమె పక్షము వహించియున్నారఁట. సమయము వచ్చినప్పుడు రాక లేక పనిసేయుట కొప్పుకొని యున్నారఁట. పొట్టకూటికి గడియించుకొనఁజాలని ప్రగల్భరాముని యట్టివారు రాక లేక పనికై బతిమాలుకొనుట సహజమే-కాని, పెద్దయాతఁడెట్లు ప్రవేశించఁగలిగెనని నాకు శంక వొడమెను — పెద్దవారికి ఫీజును పెద్దగదా ! ఆయన కా చక్కెరబొమ్మపై నిక్కువముగు నెనరు కలిగెనని వింటిని. అయ్యో పాపము ! ముందటి జన్మమున నా హేమలత యేమిదోసము చేసెనని యిపుడిట్టి

లేఁగాలమున కుదురైన కంబము లేక పేరు లేని పెంటతీగవలె గాలి పాలయ్యున్న యది?

సత్పురుషులెల్ల భారతిపై దయగలిగి యామెకు సహాయులగుదురు గావుత! స్త్రీరత్నములు సదా యామె సచ్చారిత్రములు నుడువుకొనుచుందురు గావుత! సర్వేశ్వరుఁడు ఆమెను సర్వకష్టములనుండియుఁ దేల్చి కడ తేర్చి కాపాడుఁగావుత!

## 12 - వ

ఎట్టి ఘోరమైనవార్త! ఈ లేఖినిని చేతఁ బట్టజాలక యున్నదానను. కర్కోటకరాజు భార్య రాత్రి గతించినది — నిన్నటి సాయంత్రము సంతోషముతో నిండియుండిన సంపూర్ణారోగ్యవతి! నేఁటియుదయ మేడుగంటలకీ దుర్వార్తవిని నమ్మ శక్యముగాకయుండెను. తెల్లవారకమున్నె దహన సంస్కారము ముగిసి ఆ చిన్నదాని సకలచిహ్నములు ఈ భువినుండి తొలఁగిపోయెను!

ఓహో! ఏమి యీ యద్భుతము! ఎన్నెన్ని విధములఁ జెప్పుకొనసాగిరి! — ఏ యింటను ఈ మాటెగదా! రెండు సుద్దులు మాత్రము స్థిరపడి యున్నవి — బంధువులమాట, జనులనమ్మకము. బంధువుల మాటను వైద్యుఁడును పోలీసువారునుగూడ ధృవపఱచియున్నారు. ఆకస్మికముగా గుండెలలో నెప్పిపుట్టి యా చిన్నది మృతిచెందెనని వీరు చెప్పుచున్నారు - కాని, తోటబావిలో పడి ప్రాణములు పోనాడు

కొనినమాట నిశ్చయమని తోఁచుచున్నది. సిగ్గుమాలిన యాఁడుబిడ్డరండ కా సతీమణి సన్మార్గము సరిపడక దినదినము తమ్మునితో చెప్పరానితప్పు కొండెములు చెప్పి యాపె నన్యాయముగఁ గొట్టించుచుండును. రాత్రి ఆ క్రూరాత్ముఁడా పెను సున్నములోని శెముక లేకుండఁ గొట్టి హింసింప నా సాధ్వీమణి సహింపనేరక బావిలోపడి ప్రాణములు త్యజించెనఁట.

ఈ రాత్రివేళ నింక వ్రాయఁజాలను. ఈ క్రూరకృత్యమును దలపోయ నాతల గిఱ్ఱున చుట్టుచు, చేయి గడగడ వడఁకెడిని. నా స్నేహితురాలీ చెంత పోవుచుండునటులే తోఁచెడిని. హా! గౌరీ! ప్రియసఖీ! ఎక్కడికేగితివమ్మా! ఇఁక నిట కెన్నటికి రావఁటమ్మా!

కటకటా! కలతెలుఁగు కనుంగొని కలుషాత్ముల దండించు పరాశక్తి ప్రపంచమునందే మూలను లేదా! ఈ భూలోకమున లేనట్టె కన్పట్టెడి. ఇచ్చట ధనమే దైవముగ – సర్వశక్తిగల దైవముగ – నేర్పడియున్నది!

## 13-వ లేఖ.

ఖేదమునుండి మోదమునకు మూఁడడుగుల దూరముగూడ లేనట్లు తోఁచెడిని. నిన్నటి ఘోరవార్త ఘోష యణఁగక మున్నె నేఁటి విశేషమునుగూర్చి యందఱు వెక్కిరించుచు చెప్పుకొనఁ దొడఁగిరి! ఔరా! ఒకదినమును మఱొకదిన మెట్లు మ్రింగుచున్నది!

ఎట్టకేలకు ప్రగల్భరాముఁడు పెండ్లియాడెను !—తనజాతి వారిలో పెండిలిగాని పడుచులనె గాక వితంతువులనుగూడ విడువక దేశమెల్ల నాలుకొఱకుగాలించుచుండిన మీప్రగల్భ రాముడు ! సంస్కర్తవలె పైకి నటించుటవలన హాని లేదు గదా! ఆలుపోయిన వంకపెట్టుకొని యీ యుప్రాశ్యుఁడు పిల్లను చూచుకొనుటకని ప్రతిగృహస్థు నింటను జొరబడి యెన్నో కొఱగానిపనులు సేయఁగడఁగి చెప్పుదెబ్బలు సంపాదించుకొనియెను ! దుర్భాగ్యము నందైన తన స్నేహితుఁడు మహీపతివలె నిపుణుఁడు గాక యితఁడు వట్టి తెలివితక్కువ దద్దన్న గదా!

ప్రగల్భరాముఁడు తా వరియింపగూడిన చిన్నదానికెన్నో అసాధారణములగు— అలభ్యములగు — లక్షణములు నియమించి యుండెనఁట ! ఏల నియమించగూడదు ? గొప్ప దశకు రానున్న క్రొత్తలాయరు — ముందు న్యాయాధిపతియుఁగా వచ్చుఁగదా !—శీఘ్రకాలముననె వయసు వెల్లకమున్నె ముల్లె గడించుకొని హాయిగ నింటఁ గూర్చుండఁగల యాతఁడు ! రూపమ్మా తక్కువ కాదు — అతఁ డట్లే తలఁచుకొనుచున్నాఁడు — వయసా యెంత తగ్గించి చెప్పుకొన్నను అందఱు నమ్మిరి ! ప్రాతరిజిస్టర్లు వెలికితీసి, పుట్టకమున్నె యతనికి అక్షరాభ్యాస మయ్యుండవలెనని యగుపఱచవలయు నక్కఱ యెవరికి పట్టినది ?

అట్టి సుగుణైశ్వర్య సంపన్నున కెట్టిపట్టియు మేటిగాదు.

గదా! లెస్సగ చదివినది, చురుకును బుద్ధికుశలతయుఁ గలది, చక్కగ పాడ నేర్చినది, లెక్కలయందు తెలివిమీఱినది, చక్కనిది, సద్వంశమునఁ బుట్టినది, రొక్కము తేఁగలది, ఎక్కువ దీర్ఘమును హ్రస్వమునుగాని ముక్కుగలది, తన మృతసతి కన్నులఁబోని కన్నులుగల్గి మొత్తముమీఁద నాపెను మించిన లక్షణవతి కావలెనని కోరుకొనుటతప్పా? పాప మా మొదటి భార్య గుణముల నెల్లఱ యెదుట నెప్పుడు కొనియాడుచు ఆపెకు తనపైఁ గలిగియుండిన యనురాగమ్మునతఁ డెంతో గొప్పగ చెప్పుకొనుచుండుఁ గదా!

ప్రగల్భరాముని ప్రకటన చదువుకొని అందఱును వెఱఁగందిరి — దానిని తానే స్వహస్తమున వ్రాసి యీ యూరను వెలుపటను గూడ ప్రచురపఱచెను! ఈ కన్యాన్వేషణ కార్యమున నతఁడు సాయముకోరిన హితులును బంధుగులుఁ గూడ నసహ్యపడఁ దొడఁగిరి. వారిలోఁ గొందఱు కొందఱికి — శ్రమపడి మంచికన్యకల వెదకి తెలిపినవారికి — కోపము గూడ కలిగెను. అందఱి ప్రాణములును విసిగెను. అతనికి పిల్ల కుదిరెననియు పెండిలికానున్నదనియు నైదారుదినముల క్రింద తెలిసినప్పుడు అందఱు నచ్చెరువడి సందియపడువారే! నమ్మినవారు ఆ కన్యక యెవరెప్పుడు చూడఁగల్గుదుమని ఆత్రపడఁ దొడఁగిరి.

నేఁటి యుదయమున వివాహము జరిగెను — నాలుగు గడియలపని, ప్రథమభార్య యందలి గౌరవము చేతనఁట! ఎవ్వ

రిని పిలువలేదు. విందులు, వేడుకలు, ఊరేగింపు, ఏ గడబిడయు లేదు. పిల్లముత్తవతల్లి మాత్రము, అల్లునికి రెండవ పెండ్లిగాని మా పిల్లకు రెండవపెండ్లియా యని సణుగుకొనెనఁట!

అందఱకు హాయితోఁచి గుండెలు నెమ్మదిగఁ గొట్టుకొనుచున్నవి. కాని, యీ పదియేండ్ల బాలిక నీతఁడు కనికన్నతోడనె వరియించిన వింతవార్త తెలిసికొని యమ్మలక్కలు వెక్కిఱింప నారంభించియున్నారు. ఆ చిన్నదానికి లెక్కలయందుఁగల చురుకుతనమువలన ఈ పెండిలికుదిరెనఁట! ఏవో పది చిన్న ప్రశ్నలు పలకపై వ్రాసి కూడుమని తానును కూడఁగా నిద్దరి కొక్కచోటనె తప్పువడెనఁట!—ఎట్లు మెచ్చుకొని వరింపకయుండఁజెల్లును? ఒక టేగట్టుపై కాలుజారి పడితిమని ఆఁబోతున కావుదూడపై అనురాగము కలుగవచ్చుఁగదా!

భగవంతుడా పసిబాలను దయతోఁగాపాడి సుఖపెట్టుచు భర్తయప్రయోజకత్వమును మరుగుపఱచఁగలశక్తి యామె కొసంగుఁ గావుత!

## 14-వ లేఖ.

అపరక్రియ లారంభించిరి—తాఁ జేయుట కొడలువంగక రాజు మరియొకరిచేత చేయించుచున్నాఁడు. కష్టము తప్పుటయు, కనువారికి దుఃఖాధిక్యము కన్పట్టుటయు, రెండునుగూడ సమకూడెను!

నేఁడొక చిత్ర – విచిత్ర – వార్తవినవచ్చెను. చాల విచిత్రమైనది–కాని నిజమే. నేఁటియుదయము కర్మప్రదేశమున వండిన బలియన్నమును కాకులుముట్టినవి కావఁట, చెంతకుఁగూడ రాలేదఁట! భాగ్యమదమునవిఱ్ఱవీఁగియున్న యామగఁడందరియెదురుగఁ తన యున్నత భావమువిడిచి చేతులు మొగిడిచి తన మృతసతిని దలఁచి యామెకోరిక తప్పక చెల్లించునట్లు చెప్పి చెంపలు వేసికొనువరకు ఒక్క–కాకిగూడ చేరువ రాదయ్యెనఁట! ఆ యిల్లాలి కోరికలు భర్తకు తెలియని వేమున్నవి?–ఆమె ముద్దుబిడ్డకే కొఱంతయు లేకుండ తాను జీవించియుండునట్లె జరుపుచు పెంచి పెద్దసేయుటయు సవతి తల్లివలన కష్టములు రానీయక యాబుడుతనిఁ గాపాడుటయుఁ దక్క– మఱేమున్నది?

ఆమాట చెప్పి యొప్పుకొన్నతోడనె కాకులెల్ల గుంపుగ వ్రాలి ఆయన్న మొక్క–మెతుకు మిగులకుండ నిముషములో మ్రింగి వేసినవఁట. అందఱు నాశ్చర్యమగ్నులైరి. భగవద్భక్తిలేని యా భర్తయు భయముతోడ గడగడ వడఁకెనఁట!

అది యెంత ఆశ్చర్యము – గుణవతి య్యా గౌరియాత్మ అన్నము నావరించి తనకోర్కి–నెఱవేరుట నిశ్చయపఱచుకొనువఱకు కాకులను రానీక యదలించుట! అయ్యో! మన యిప్పటి చదివినవారును సంఘ సంస్కర్తలును మన మతాచారములను కర్మకాండను దూషింతురే వారెంతటి బుద్ధి

హీనులని తలంపవచ్చును! జౌరా! అల్పజ్ఞానమువలని యన
ర్థము!

సర్వజ్ఞత్వభావముతోఁడ మెలఁగునట్టియో మానవుఁడా!
మహిఁగల యీ యీశ్వరచిహ్నములను గని తలవంచుకో!
అల్పమని నీ వెన్నుచుండు కాకమునకుఁగల సూక్ష్మదృష్టి నీకు
లేదు గదా! దాని చిన్నికన్నులకగుపడు విశేషములు నీ పెద్ద
చక్షువులకు అగోచరములు! మఱి కంటివా, అల్పమగు
వాయస మెట్లు స్వేచ్ఛావృత్తిని స్వచ్ఛమగు వాయువులో
విహరించుచు పైకెగిరి పోఁగలదో? ఏ మానవనాథున కిది
సాధ్యము? మనుజునకు మస్తిష్కము గలదది నిజమే - కాని
దాని ప్రయోజనమేమి, చక్కఁగఁదలపోయక తత్తరపడి జ్ఞా
నాంధత్వముఁ దెచ్చుకొన్న నాఁడు? మీ కొలతలకు కుతంత్ర
ములకు లోఁబడని దెద్దియుఁ బ్రపంచమున లేదని యెన్నుచు
కద్దనువారిని పెద్ద మూఢులుగను వెఱ్ఱివాండ్రుగను దలంప
కుఁడు — మీ మస్తిష్కము లెంత, మీ బుద్ధి సూక్ష్మమెంత,
యీశ్వరసృష్టియందలి మహామర్మములఁ గనిపెట్టుటకు?

ప్రియవరా! వేదాంతమార్గమునఁబడి పరచితినా? ఏమి
సేయుదును — నిలువనేరక పోతిని. నా హృదయ మంతయు
గౌరితో నిండి యున్నది — కాలము ముగియకమున్నె యీ
జన్మమునుండి తొలగింపఁబడియు తన కలవడిన కష్టమును
గూర్చి చింతింపక యెవరిమీఁదను ఎగ్గించక, ఒక కోర్కె —
తన ముద్దుబిడ్డ సౌఖ్యమొక్కటియె — కోరుకొని దానివలన

తృప్తియు ఆనందమును కనఁగల్గిన ఘనమతి! గౌరీ! హా! ప్రియసఖీ! ఈ వ్రాతపైఁబడు నా కన్నీరు నీకు కానుకగాఁ గొనుమమ్మా! ఆహా! ఇంక నీ ప్రియస్నేహితురాండ్రు నీతోడ ముచ్చటించవలె నన్నవారికి కన్నీటి బాష్పములె భాషగదమ్మా!

## 15 - వ లేఖ.

ఓహో! కొందఱి హృదయము లెంత కఠినములు! అది యెంత యవమానము! నాల్గు దినములైనను కాలేదు అప్పుడే పిల్లను నిశ్చయపఱచిరి! దినముకూడ నిశ్చయమయ్యెను! ఉదయమున ఉత్తరక్రియలు, సాయంత్రమున పెండ్లి రాయబారము! — రెండు నొక్కనోట నుచ్చరించుటయు పాపము గాఁదోఁచెడిని. అయిన నెగ్గని తలఁపక రెండును జంటగ నడపి ముగించిరి! రెండెక్కడ ముగిసినవి? — ఉత్తరక్రియ లింక నెనిమిదిదినములు జరుగవలసియున్నను పెండిలి రాయబారమప్పుడె సంపూర్తియైనది!

ఇదంతయు పెద్దలు నెరవేర్చినపని! — మిగుల చుఱుకుగఁ గూడ నెరవేర్చిరి! గృహస్థాశ్రమమునకుఁ గల్గిన లోపమును తత్క్షణముపోనాడుట యత్యావశ్యకమఁట! ఇట్టి యమానుషమగు నా తురమువలని ఫలము — ఆహా! అది యూహింప శక్యముగాక యున్నది!

రేపటి యాదివారముగాక పై యాదివారమునాఁడు వివాహాలగ్నము — ఈ లోకమున ప్రాప్తిలేని గౌరీమణి పరలోక

మున కేగిన పదునాల్గవ దినము! పిల్ల పదియేండ్ల యర్భకు రాలు — అమృతదేవుని మనుమరాలు, ప్రథమ భార్యసంతతి. పెండ్లియైన మఱునాడె మగనివద్ది పంపున ట్లేర్పాటఁట! — అతనికిఁగల్గిన గృహస్థాశ్రమలోపముతీర్చి చిట్టిచిట్టి సేవలు సేయుచుండుట కఁట!

## 16 - వ లేఖ.

ఈ వారమంతయు మీ వద్దనుండి జాబు రాక నాదసుకు పెట్టె నుండి మీ కడపటి జాబుతీసి మఱిమఱి చదువుకొంటిని.

నిశ్చయముగా, మీరున్న యింటివారి పిల్లలనుగూర్చి — చదువు సంగీతములు నేర్చిన ఆ చక్కని యప్సరసలఁగూర్చి — మీరు వ్రాసిన మెప్పుమాటలన్నియు చదువుకొని యానం దించితిని. ప్రియవరా! వారిని నేఁ గనవలెననియు వారి వీణ వాయింపు నే వినవలెననియు ఏల కోరెదరు? శారదను సం గీత మభ్యసించనీక ఆ చిన్నదాని వీణ పగులఁగొట్టిన మూఢు రాలా యత్తముండ వినవలెనని కోరుఁడు. ఆమె వినిన తన మూఢత్వము వదిలి ముందైన దయగలిగి యుండనోపు.

ప్రియరమణా! నాకు నిజముగ నెంతో సంతోషముగ నున్నది — నావలె మీరుగూడ సుఖము చెడి యుండ లేదని. సదా మీ క్షేమముకన్న నా కెక్కువ సంతోష మేమున్నది? మీ చెలికత్తెలగు ఆ యచ్చరలకు నా వందనములు తెలు పుఁడు — వారి వీణాగానము మీ వీనుల్లకు విందు సేయఁగల

దని సంతసిల్లెదను. ఇంతదూరమున నే సేయుగానమువలన నేమి ప్రయోజనము ?—మీరిచ్చుటకి వచ్చువఱకు నావీణను తాఁకను !

## 17 - వ లేఖ.

ప్రాణప్రియా! - నా హృదయము నెద్దియో బాధించుచున్నది — ఎదియో పేరులేనిది, వేరును లేనిదిగ నుండనోపును. నా పిచ్చియూహలే నాకు శాపములు. అవి యెన్నఁటికేని నన్ను పిచ్చిదానిగ మార్చునోయని భయపడియెదను.

మనోహరా! ననుదూరకుఁడు. నా యనుమానముల నణఁగఁద్రొక్కి—కొని నలుగురిలో సంతోషముగఁదిరుగ ప్రతి నిమిషమును బ్రయత్నించుచుందును. కాని వెనువెంటనె నా మనమున మబ్బుగలిగి నా యత్నము నిష్ఫలమయ్యెడి !

ప్రతిదినము క్రొత్తసంగతులు తెలియవచ్చుచున్నవి. అనేకులు మన సంబంధము నిష్టపడక వెక్కిరించుచున్నారిది నిశ్చయము. అన్నిటికంటె నాశ్చర్యమును విచారకరము నగు మాట — మీగంగ, మమ్ముందు సమ్మతించిన మీ గంగాదేవి, యిపుడందరి యెదుట మిమ్ము నిందించుచున్నదఁట ! — కులముగాని కులమున నొక కులుకులాడిని కట్టుకొంటిరని! ఔరా! ఈ అన్యాయపులోకము! ఎదుటివారి సుఖముగని కండ్లుకుట్టని వారు కట్టరుదుగదా! ఇంక తాము సుఖదూరులయ్యును ఇతరుల సౌఖ్యమును గోరువారెందఱుందురు?

ప్రాణేశ్వరా! దినదినము నిట్టిమాటలు నన్ను పొడుచు చున్నవి. కాని యవి యెట్టివైనను నామనమును బాధింపవు. సర్వోత్కృష్టమును సకలబాధ నివారణమునగు మీ ప్రేమామృత ముండ నన్నేది బాధింపఁగలదు? మీ ప్రేమామృతము — ప్రాణప్రియా! — మీ ప్రేమామృతము తక్క వేఱొండు నాకు పనిలేదు!

ఆహా! అదిగో రంగనాయకి వచ్చుచున్నది — మంచిసమయమున వచ్చుచున్నది. ఈ జాబిచ్చుట ముగించి యాపె వేదాంతమొకింత యాఁరగించి కలవరపడియుండు నా చిత్తమును సరిపఱచుకొనియెద.

## 18-వ లేఖ.

ప్రియతిలకమా! నిన్నటి మధ్యాహ్నము రంగనాయకి యిచ్చటికి వచ్చుట నిశ్చయముగా దైవికమని తలఁచెదను. ఎంతో నిరుత్సాహముగ నుండినదానను, ఆమెతోడ సంభాషణ భాగ్యము లేకుండిన బొత్తిగా విచారమున మునిఁగియుందును. ఆపె సంభాషణమెంతయు మనోహరముగదా!

"ఏమిచింతను దగిలియున్నావు? ఏటికీ విచారపు మోము?" — అని నను గన్నతోడనె నా స్నేహితురాలు ప్రశ్న వేసెను.

"ఏమియు లేదు" — అని బలవంతముగా చిరునగవు తెచ్చుకొని పలికితిని — "ఏమియు లేదు - ఈ ప్రపంచమే విచారమయము."

"ఉత్సాహమును పూనుము. పిచ్చిదానా! ఉత్సాహము పూనుము" — అనుచు రంగనాయకి మందలించెను. "లోకములో సంతోషమును సంతాపమును సమానముగనే యున్నవి."

ఈ మాట నా మదికి సూటిగఁ దోఁచెను. మఱి రెండు నిముషములకు ఈ వారములో జరిగిన విశేషములనుగూర్చి సంభాషింప దొడఁగితిమి.

"ఏవిధమున పరికించినను నామనస్సున కది యొప్పియుండ లేదు"—నేనంటిని—"భార్య మృతిచెందిన రెండువారముల లోపలనే మరలఁ బెండ్లియాడునట్టి అమానుషకార్యము. మన మతాచారములనుబట్టి యటుసేయుట ముఖ్యమఁట! కటకటా! మన మతము అక్కటికమాలిన రక్కసియా అట్టి బెట్టిదములను నియమించుటకు?"

"హాహా! కమలా!"—నా స్నేహితురాలు నా మాటల కడ్డువచ్చెను—"మన మతాచారముల మర్మములంత సులభముగా పైకి తెలియునట్టివి గావు సుమీ. పరిపూర్ణజ్ఞానము లేనివారికి బోధపడని విషయము లనేకము లుండుట నిశ్చయము. కాని మతముమాట యేల, మన యనుభవమునందే లేవా అమానుషముగఁ గన్పట్టి నీ మనస్సును కలవరపెట్టియున్న యాచారము మంచిదే యనఁదగిన కారణములు?"

నే నెంతయు తెల్లపోయి చూచితిని.

"ప్రాణపదమైయుండు ప్రియురాలు గతించిన పిదప భర్తకు మతి యెక్కడిది, మదియెక్కడిది!"—నా స్నేహితురాలు విస్తరించెను—"అంతయు పోయినది, తుత్తునియలైనది. తునియలను మరలగూర్చి సాధ్యమైనంతవఱకు చక్కఁజేయవలయును. చిత్తము నావరించియుండు దుఃఖాగ్నిని చల్లార్పకున్న నది యా జ్వాలలకు మండి మసియగునుగదా! భార్య మృతిచెందినవానికిని, భీకరరోగమువల్ల పీడింపఁబడుచు మృత్యు వాసన్నమై ఆలోచనశక్తి చచ్చియుండువానికిని ఏమిభేదము? చికిత్స బంధుమిత్రుల కొప్పగించి ప్రాణరక్షణార్థము వారిచ్చునట్టి అరుచ్య—అసహ్య—పదార్థములను మ్రింగుట యితనికి విధాయకము గదా!

ఈ యుదాహరణము కొంతవఱకు నన్ను జయింపఁగా నేమియు పలుకనేరక యూరక చూడసాఁగితిని.

రంగనాయకి మరల తనమాట లందుకొనెను—"విచారము పెరిఁగి హృదయమునఁ జిల్లులుచేసికొని ప్రాణమును పీల్చినపిమ్మట చక్కఁజేయఁ బూనుకొనుట యేమి వివేకము? విచారము రసభావమె యగుఁగాక - యీ యతుకుల బ్రతుకులో రసభావమెల్లప్పుడు క్షేమకరముగాదు. దహనమా? భూస్థాపనమా?—భూస్థాపనము సరసమెకాని నిష్ప్రయోజనము, దహనము విరసమయ్యును అనుభవమునం దుత్తమ మార్గము సుమీ. ఈ మన బ్రతుకెంత విచిత్రమో చూచితివా? ప్రాణముపోయి మన్నగుటకు సిద్ధముగనున్న కళేబర

మునకుఁ బలె నానాఁటి కుసురుగొని పెరుఁగునట్టి విచారము నకుఁ గూడ దహనమే యుత్తమ సంస్కారము. అదియే వివేకమార్గమని యనుభవమువలనఁ దేటపడియెడిని. ఈ యనుభవ మన్యదేశమువారికి తెలియుట దుస్తరము గదా!

నా నోటమాటే రాకపోయెను. ఒకనిముస మూరకుండి కడుఁ బ్రయత్నముతో నోరువిప్పి మాటాడితిని — "అయితే, రంగా, హృదయము కాలుచు కంట్ల నీరు గారుచుండ ప్రేమ గొని పెండ్లియాడవలె నందువా!"

"అదిగో! అదిగో! కమలా!" — నా స్నేహితురాలు బదులు చెప్పెను — "మన హిందువుల వివాహము కేవలము ప్రేమానుబంధమువలనఁ గలుగునట్టిదని తలఁచెదవు. అటు గాదు సుమీ. మనలో వివాహము కర్తవిశేషము. వధూ వరులు బాల్యులగుటచే ఒండొరులను ముందుగ వారు గని వలచుట యను విషయము లేక పెద్దల యేర్పాటు శిరసా వహించి యిహపరసాధకమగు ప్రేమను పెంచుకొనుటయే మన పద్ధతి. అటుగాక వలచి పెండ్లియాడుపద్ధతిలో, భార్య మృతిచెందిన వెంటనె ద్వితీయవివాహము అమానుష కృత్య మే, శ్మశానవివాహమే, యనఁజెల్లును."

అటుపిమ్మట కొన్ని యితర విషయములనుగూర్చి మాటా డుచు గ్రహణమునాఁడు నాకంటఁబడిన విపరీతమును దెలిపి తిని—సిరిసంపదలు క్రొల్లగఁ గల యెుువ దేండ్ల ముసలికోఁతికి

బలిగా నియ్యబడిన పదునారేండ్ల బాలసుందరిని గన్నట్టి కష్టము.

"కమలా!"— నా స్నేహితురాలు సమాధానము చెప్పెను— "ధనపిశాచమువలని పీడ అన్ని దేశములయందును అన్ని పద్ధతులయందును గలదు సుమీ. బిడ్డలపెండ్లి విషయమున తలిదండ్రులనే కాదు, స్వయంవరములలో వధూవరులనుగూడ ఈ ధనపిశాచము తప్పుత్రోవను బెట్టుచున్నది. బంగారుబొమ్మ మన భారతిగతినితలంచి యెన్నోసార్లు కన్నీరు గార్చితిని. ఇట్టి ఘోరములు కండ్లఁబడినప్పుడు మన పద్ధతి దూషణీయముగఁ దోఁచునుగాని, అట్లని పద్ధతియే వలదన రాదుగదా! సంపూర్ణముగ దోషరహితమై దుష్కృత్యముల కెడ మీయని పద్ధతి లోకమునం దెచ్చోటను గానంబడదు."

"అయితే, రంగా!"— నేనడిగితిని— "పురుషుఁడు తన యిచ్చవచ్చినంత మంది భార్యలను బెండ్లియాడఁగూడువని మన ధర్మశాస్త్రములలో నున్నదఁటమ్మా?"

"ఉన్నదఁట"— నా స్నేహితురాలు బదులుచెప్పెను— "కాని, కొన్ని ముఖ్యమైన కారణములు— అనగా, భార్య వ్యభిచారిణి, వ్యాధిగ్రస్తురాలు, గొడ్రాలు, ఇట్టి సందర్భములు— కలిగియున్నప్పుడు పురుషుఁడు మరల పెండ్లియాడ వచ్చునని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవఁట. కాని, మన కండ్లఁబడు ద్వితీయ వివాహములలో ,ముప్పాతికె మువ్వీస

మునకు కామోద్రేకమే కారణము. పెక్కండ్రు భార్యలను పెండ్లియాడు పెద్దప్రభువు లిహపరసాధకమగు ప్రేమామాధుర్యమునకు వెలివారలై మృగప్రాయులుగ నుందురు!

"ఏల యట్లనియెదవు?"—నేనడిగితిని—"వంగదేశమున కొందర గ్రజాతి బ్రాహ్మణులు పెక్కండ్రు భార్యలను బెండ్లియాడి వారితోడఁ గాపురము సేయుటయే లేదని వింటిని. వారి విషయములో కామోద్రేక మెక్కడిది? కొందఱు నూఱుమంది భార్యలనుగూడ బెండ్లియాడిరఁట—వీరందఱి పేర్లు జ్ఞాపకముంచుకొనుట కొక చిన్నపుస్తక ముంచుకొని యుందురు కాఁబోలు!"

"ఎంత పరిహాసాస్పదము!"—నా స్నేహితురాలనియెను—"కన్నీరు గార్పించుటకు మాఱుగా నగవు పుట్టించెడిని. కాని, యట్టి విపరీతములు కట్టరుదు - శాఖాభేదములవలన కలిగిన మూర్ఖత్వమే వీనికి కారణము - ఎట్టి పూర్వాచార పరాయణులును వీనిని సమ్మతింపరు."

పిమ్మట కొంతసేపు గారి దుశ్శరణమును గూర్చియు ఆపెయుత్తరక్రియలను గూర్చియు మాటాడితిమి. ఈ సందర్భమున నొకప్రశ్న యడిగి, నా స్నేహితురాలు బదులు చెప్పనేలేదని తలఁచితిని.

"అన్నిటికి సమాధానము చెప్పితివిగాని, రంగా!"—నేనంటిని—"జీవించియున్నవారికి ఉత్తరక్రియలు జరుపు మాట యేమి చెప్పెదవు? వితంతువును పెండ్లియాడిన యా

తని కొక్కనికిని క్రీస్తుమతమునఁ జేరిన యాతని కొక్కనికిని కర్మచేసిరఁటగదా!"

"మన ధర్మశాస్త్రములలో" — నా స్నేహితురాలు తెలియఁజెప్పెను—"కులభ్రష్టుఁడును మతభ్రష్టుఁడును మృత తుల్యులని, అనఁగా వారి మతమువారికి మృతతుల్యులని, చెప్పఁబడియున్నది. దీనికి మన పురోహితులు విపరీతార్థము చేసి ఉత్తరక్రియలు నియమించి యున్నారు — వట్టి వ్యా ఖ్యమెకాని, వేఱొకటికాదు. ఈ యుత్తరక్రియలవలన లేశ మును ఫలము లేదు."

"ఫలమా! వానివలని యవమానమో!"

"నిజమే, అవమానమే — కాని బుద్ధిపూర్వకముగఁ జేసి నదికాదు."

నా స్నేహితురాలి యుక్తికి మెప్పుతోఁచి నవ్వితిని—ఆపె తెలివి నెల్లప్పుడు కొనియాడుచుందును గదా? అధికముగ గ్రంథములు చదువకయే యిన్ని సంగతులెట్లు గ్రహించితివి, యింతజ్ఞానమెట్లు సంపాదించితివని యాపె నడిగితిని. ఈ మెప్పుమాట యొప్పుకొనక తలద్రిప్పి, తనకు తెలిసిన నాల్గు ముక్కలును తన తాతగారు శాస్త్రవేత్తలగు ఘనపండితుల తో అప్పుడప్పుడు తమ యింట జరుపుచుండిన సంభాషణ ములును వాదములును వినుటవలనఁ గలిగెనని తెలిపెను.

"ఎంత యదృష్టము!" — నేనంటిని — "పూర్వాచార పరాయణుల యింటఁబుట్టి పెరుఁగుట! నా తండ్రిగారు విద్యా

వంతులు, గౌరవపదముగలవారు. కాని, జాతి మత భేదములు పరికించువారు కారు. నాతలిదండ్రులను నేనెంత ప్రేమించుచున్నను వారి ప్రేమ నెంత పెద్దగ భావించుచున్నను నన్ను వారు పెంచిన పద్ధతిని కొనియాడుట మానితిని. ఎంతో ధనము వ్యయముచేసి వారు నాకు విద్య కఱపించిరి. చదివి చదివి నా కన్నులు పాచిపోయినవి. కాని, యెన్ని గ్రంథములు చదివి యేమి ప్రయోజనము—అందులో తెలిసి తెలియని సంఘ సంస్కర్తలు రచియించిన గ్రంథములు? మన యింగ్లీషు చదివిన వారిలో అనేకులు తెల్లవారల పద్ధతులను పైపైనం గని భ్రమించి మనపద్ధతుల మర్మములసలే తెలియనివారలై గుఱ్ఱముగాక, గాడిదెగాక, కంచరగాడిదెయుంగాక, కాటి మృగముచందమున నున్నట్లు నాకు తోంచుచున్నది. వారు బోధించెడి మాటలును వర్తనములును నాకే—అవి యామోదింపవలసిన నాకే—పలుమారు పిచ్చివిగా కనుపడినవి."

ఈ మాటమీంద నా స్నేహితురాలిట్లనియెను. "సంఘ సంస్కర్తలని పేరుపెట్టుకొన్న మీవారు చెప్పునట్లు కాకున్నను మనమతాచార పద్ధతులలో మార్పుగోరినవి మార్పం గూడినవి పెక్కులుండుట నిశ్చయము. కాని, నవనాగరికులకు కొంతమంది కెంత కష్టముగా, అసహ్యముగా, కనుపడినను మార్చరాని విషయము లనేకములున్నవి సుమీ. అవి మార్చినచో అనాదినుండి నిలిచియుండిన మన హిందూ మతాచారమహాభవన మదుగంట గడగడవడంకి పడిపోను.

ప్రతి మతమువారిలో, ప్రతిజాతివారిలో, ఏదో యొకతీరున కొన్ని కొన్ని నిబంధనలును కట్టుబాట్లును ఏర్పడియుండుట యావశ్యకము. అట్టి కట్టుబాట్లు నవనాగరిక శిఖామణులకు కష్టము తోఁపించియు, మొత్తముమీఁద ఆయాజాతుల కవి నిశ్చయముగ క్షేమకరమే. శాశ్వత నిర్మితమగు మహాభవనము నప్పుడప్పుడు పైపైనఁ దుడిచి పరిశుభ్రముచేసి క్రొత్త వన్నెలు కలిగింపవచ్చును — అటుల సేయుట ముఖ్యమే — కాని, యద్దాని నడుగంటఁ ద్రవ్వి క్రొత్తపునాదులపైనుంచుట సాధ్యమా? సంపూర్ణముగ పడఁగొట్టక బహిరంగ స్వరూపమును మార్చుటయు శక్యముగాదు గదా! పదిమంది కాదు పదిలక్షల నవనాగరిక బృందముకూడ అట్టిమహాభవనమును పడఁగొట్టుట వట్టిమాట. దానికిఁ గలిగింపఁగూడిన వన్నె చిన్నెలతోఁడ తృప్తిలేక, యందుండుట వారికి కష్టముగ తోఁచినయెడల, వారు వెలుపటికరిగి తమయిష్టము చొప్పున నూతనభవనమును నిర్మించుకొనఁ బ్రయత్నము సేయవలయును. అట్టి ప్రయత్నము కొనసాగకపోయినను, వారు నిర్మించఁగల భవనము పదిగడియలలోనే పడిపోయినను, వెనుకటివారికి తెప్పగ బుద్ధివచ్చుట నిశ్చయము."

"సత్యము, సత్యము!" — నే నంటిని — "మన సంకర విద్వాంసులు ముఖ్యముందు జాతిభేదములు గదా తెగవనుచు దూరుచున్నారు!"

"అవును గదా" — నా స్నేహితురాలా మాట యందు

కొనెను — " వారే కొంచెము కన్నులు తెఱచి నిదానించి యోచించిన యెడల ఏదో ఒకరీతిని జాతిభేదములు ప్రపంచ మందెల్లెడలఁ గలవని తెలిసికొనఁగలరు. ప్రతి జనసంఘము నందును అట్టి భేదములు తప్పక యేర్పడును. మనలో కుల భేదములు—మఱియొకరిలో కొద్ది గొప్పల తరగతి భేదములు. కులము లొండొంటితో కలియంజాలవు, కొద్ది గొప్పల తరగతులు కలిసి మారుచుండును. ఇంతేకాని వేఱుకాదు. వారివారి అనాదిగుణాధిక్యతను బట్టి యేర్పడిన కులములు ఎన్నటికినికలిసి మారఁగూడదను మన హిందూపద్ధతియందు ప్రాశస్త్యము లేకపోలేదు. ఆ పద్ధతిని మార్చవలెనన్న మన హిందూమతాచారభవనమంతయు పడఁగొట్టి నూతనముగఁ గట్టవలయును. కులభేదములు వదిలివేసినవారినిగూడ దిన దినము కులవిషయమైన పట్టింపులు బాధించుచున్నవి. కనఁ గన వింతగనున్నది. క్రీస్తు మతావలంబులుకూడ వివాహాది విషయములందు తాతలనాఁటి జాతిభేదములను పరికించు చున్నారు గదా! అగ్రజాతి క్రైస్తవులు తక్కువవారితోడ సంబంధములు చేయుటకును కలియుటకును వెనుదీయుచు న్నారు. తక్కువజాతి క్రైస్తవులు పైవారికిని తమకును గల భేదమును మాపఁజూచుచున్నారు—ఇది సుప్రసిద్ధము. ముఖ మున బొట్టుమానవచ్చును, పేరు మార్చుకొనవచ్చును, కుల బిరుదములు వదిలివేయవచ్చునుగాని, యేమిచేసినను క్రై స్తవులు తమ కులమును దుడిచి వేసికొనఁగల్గుట కనేక శతా

భ్రమలు పట్టును. కులమన్నది మనుష్యుని బొట్టు కట్టుల యందిమిడియున్నదని తలంచుట తప్పు - అది ప్రతియంశము ప్రతియంతరాంశమునందును చేరియున్నది సుమీ."

ఈ మాటమీఁద నే నంటిని — "తమతమ కులబిరుదములను వదిలివేసి పేర్లు పొట్టిచేసికొనుటకు బదులు అందఱు నే దైన అగ్రజాతి బిరుదమును ధరించినచో జాతిభేదములు మాసిపోఁగూడును గదా?"

నా స్నేహితురాలునవ్వి యిట్లని బదులు చెప్పెను. "నీవు చెప్పినది మంచి యుక్తియే కమలా! ఆలాగు చేసినయెడల జాతిభేదములు స్పష్టపడక అందఱు నగ్రజాతివా రగుదురు. మన క్రైస్తవ స్నేహితు లీ యుక్తి నవలంబించి అందఱును శాస్త్రులుగానో శర్మలుగానో, అయ్యర్లుగనో అయ్యంగార్లుగనో, రావులుగ రాయర్లుగనో, మాఱవలెనని కోరెదను."

"క్రైస్తవులమాట యేల?" — నే నంటిని — "కులభేదము కూడదనియు అక్రమమనియు మన నవనాగరికులు మాటి మాటికి చెప్పుచున్నారుగదా, వారేల ఆ యుక్తి నవలంబించి జాతిభేగము మాపుకొనరాదు? అప్పుడు శాస్త్రులుగారు అసలు బ్రాహ్మణుఁడో, లేక బ్రాహ్మణ బిరుదముదాల్చిన క్షత్రియుఁడో వైశ్యుఁడో నాయుఁడో మొదలారో పిళ్లో, లేక పంచముఁడో, యెవ్వరు చెప్పఁగలరు!

నా స్నేహితురాలు నవ్వుపట్టఁజాలక పోయెను. అంతట తలవాకిట దీనాలాపములు వెట్టుచున్న యెవరో స్త్రీయొక్క

మృదు ధ్వనులు వినఁబడి అది యేమో చూతమని యచ్చటికి పోతిమి. వయసునందున్న బిచ్చగత్తెయొక్క తె పసిబిడ్డ నోడిఁ గట్టుకొని బిచ్చముకై వేఁడుచుం డెను. ముద్దులుమూట గట్టు చున్న యా పాపనుగని, లేచివచ్చిన మా శ్రమ వ్యర్థము కా లేదని తలఁచితిమి. ఎంత చక్కని బిడ్డయని చెప్పుదును— దానిం గన్నతోడనె చేతులార ఎత్తుకొని కఱువుదీర ముద్దాడ బుద్ధి పుట్టెను. ఆహా! చెన్ను మీఱిన యా చిన్ని మోము, ఆ నల్లని కురులు, కొట్టవచ్చిన యా కన్నులు, దొండపండువంటి ఆ చిఱుపెదవులు, ఆ చిన్ని చేతులు, కాళ్లు—ఆ బంగారుబొమ్మ నిశ్చయముగ ఆ తల్లిబిడ్డ యని నమ్ముట శక్యముగాక యుం డెను. నేనును నా స్నేహితురాలును గూడ ఆ బిచ్చగత్తెను ఎగదిగఁ జూచితిమి. చూడఁజూడ ఆ వరాలకుప్ప యా కు రూపికడుపున పుట్టినదను నమ్మకము పోయెను. అదియు మూడునెలల బిడ్డతల్లిగ కనుపట్టదయ్యెను.

"కటకటా! ఈ మన బ్రతుకున నెట్టిబెట్టిదములు!"— అని నిట్టూర్పుతో పలికితిని.

"ఎచ్చటను, ఏ పద్ధతివారియందు నిట్టివి తప్పవుసుమీ" — అని నా స్నేహితురాలు బదులుచెప్పెను.

అదృష్టవశమున ఉసురుతోడ ఆ బిచ్చగత్తె కిచ్చివేయఁ బడిన యా బిడ్డగతిని దలపోయ నా హృదయము జాలితోడ నిండెను. అంత నా ముద్దులమూట యానందమంతయు నా స్నేహితురాలి నారగింపఁబనిచి నే నింటిలోనికిఁబోయి యొక

బట్టయు, పాతశాలువముక్కయు, ఈ నడుమ నేను కుట్టుకొని వదులైన క్రొత్తరవికయుఁ దెచ్చి యా బిచ్చపు దానికిచ్చితిని. అవి యా చిన్నిబిడ్డ కుపయోగపడి కొంచెమేని సౌఖ్యము గలిగించుననితలఁచి యుప్పొంగితిని. నేను తిరిగి రాకమునుపే నా స్నేహితురాలా యమ్మిచేత నొక పావులాకాసు వేసెను. నేను నొక పావులా యీయ నది వెడలిపోయెను.

నే నడిగితిని—"రంగా! మన దేశములో ఈ తీరున యాచక వృత్తివల్లనె జీవించువార లెందరో కలరుగదా! ఏమందువు? పనిచేసి జీవనము సంపాదించుకొనఁగలవారికి ధర్మమిచ్చుట తప్పని యెంతెంతో చెప్పుచున్నారు గదా?"

"మన నవనాగరికుల పిచ్చులలో"—నా స్నేహితురాలు వెంటనే బదులుచెప్పెను—"నిది రెండవది. ఈ మహాదేశమునఁ గలవారందఱు చేయుట కేమిపని గలదో! యాచక మాపినచో పెక్కండ్రు చెప్పరాని దుస్థితిలో మునిఁగియైన పోవుదురు - లేకున్న దుర్మార్గము ప్రబలి దేశమంతయు దొంగలతో నిండును. తెల్లవారల దేశములో అఖండైశ్వర్యము చెంతనె, అసహ్యమై యవాచ్యమగు దారిద్ర్యముకూడ నున్నట్లు వినుచున్నాము గదా! భగవదనుగ్రహమువల్ల మన దేశములో నట్టి విపరీతములు పుట్టఁజాలవు. ఎట్టి హీనస్థితికి వచ్చినను మన ధర్మమె మన దేశమును కాపాడి జనులప్రాణ మును రక్షించుచున్నది. ఇహపరసాధకమగు ధర్మమెకదా మన అవిభక్తకుటుంబములకు మూలాధారమై యున్నది?

మన కుటుంబములలో నొండొరులకుఁ గల యన్యోన్య ప్రేమ యు ఒండొరుల నిమిత్తమై సౌఖ్యమును సంక్షేపించుకొనుట యు అన్యులకు — స్వసౌఖ్యమే ప్రధానము చేసికొని ప్రత్యేక కుటుంబముగ నుండువారలకు — తెలియఁజాలవు గదా ! ”

“ ఆహా! రంగా ! ” — నే నంటిని — “ మన యవిభక్త కుటుంబమును గూర్చియు ఒక్కఁడు సంపాదించి పదుగురు భుజించుటను గూర్చియు ఈ దినములలో నెంతదూషణ మన చెవిని బడుచున్నది ! మన చదివిన ఘనులు కొంద ఱేర్పాటు చేయఁగడఁగిన విద్యాదాయపు చట్టముమాట విన్నావుగదా ? అది యెంత ఘోరము ! ఆ చట్ట మమలులోనికి వచ్చినట్లే అందఱు భావించుకొనిరి, కాని యెట్లో అదృష్టవశమున తప్పిపోయినది.

“ నిశ్చయముగా అది దూరాలోచనము లేని పద్ధతి ” — నా స్నేహితురాలనియెను — “ అన్నదమ్ములకు చెందకుండ తన విద్యాదాయమును కాపాడఁ దలంచు నట్టి తండ్రి, తన కుమారులలో ప్రయోజకుఁడై ధన మార్జించు నాతఁడు చదువంటని పేదసోదరుని విడనాడుట కిష్టపడఁడుగదా! కమలా ! ప్రేమను జనియించు మన యవిభక్త కుటుంబము అన్నిదిశలను వ్యాపించు శాఖలుగల వృక్షము సుమీ. ఆశాఖ లధికమై యొండొంటి కడ్డువడెనేని, వానిని వేఱుసేయఁగూడును గాని వృక్షమును చంపుట యెక్కడిది? అట్లు వేర్పఱచిన యొక్కొక శాఖయు నూతనశాఖలతోడ మఱల వృక్షమగుట నిశ్చయము గదా ! ”.

"అయితే రంగా!" – నేనడిగితిని – "ఈ యవిభక్త పద్ధతిచేత మన హిందూ స్త్రీలకు హీనదశ తటస్థించెనని తలంచవా?"

"ఛీఛీ! పద్ధతిలోనేమున్నది?" – నా స్నేహితురాలు తెలియఁజెప్పెను–"మనపదుచులు పెద్దలయెడఁ బూనవలయు గౌరవవర్తన మక్రమముగ మార్పు చెందినది. మన పద్ధతిలో నిశ్చయముగా అది యవమానకరమగు మలినముగా నేర్పడినది. దానిని తుడిచివేసి మన యాచారభవనమున కెప్పటి వర్ణము తెప్పించుట యావశ్యకము."

"కొంతవఱకు" – నేను సంశయపడుచు పలికితిని – "కొంతవఱకు మన స్త్రీల విద్యారాహిత్యమే వారి హీనదశకు కారణమని తలఁచెదను. మన బాలికా పాఠశాలలోఁ గఱపఁబడు కొలఁగాని నాల్గుముక్కలు మాత్రమెగాక నిజమగు విద్యాసంపద యున్న యెడల మన స్త్రీలకు హెచ్చుదశ లభింపఁగలదు గదా."

"అవును – ఆ మాట కొంత నిజమే" – నా స్నేహితురాలు తలయూఁచుచుఁ బలికెను–"కాని, మనదేశపు స్త్రీలనందఱిని మంచి దశకు తేఁగల విద్య, చదువుటయు వ్రాయుటయు నని తలంచఁగూడదు. ఈ మహాదేశమునందుఁ గల కోటానుకోట్ల స్త్రీలలో కొద్దిమందికి–మిగుల కొద్దిమందికి– మాత్రమే యట్టివిద్య సాధ్యమగును. మన దేశపు ప్రస్తుత దౌర్భాగ్యస్థిలో వేయికొక్కరికిఁగూడనది లభియింపఁజాలదు.

ముందటికాలమునఁగూడ స్త్రీవిద్యావతు లెందరో యుండిరని తలఁచుటతప్పు. అనేకులకు—వేయికి తొంబదితొమ్మిదినూట తొంబదితొమ్మిది మందికి — గృహకృత్యములను చక్కఁగ నెరవేర్చుటయే వారు నేర్చుకొనఁగలవిద్య సుమీ. అది ప్రతి గృహమునందును నేర్పఁబడుచునే యున్నది. అట్లయ్యును, స్థితిగతులొప్పియుండు వారిలో ఎందఱువిద్య నేర్చి జ్ఞానవతులగుదురో దేశమున కంత యలంకారమును గొప్పయు నేర్పడుట నిశ్చయము. స్త్రీల విషయమున నే కాదు పురుషుల విషయమునఁ గూడ ఇట్లే సుమీ. పురుషులలోఁగూడ నందఱకు విద్యయలవడుట సాధ్యముకాదు గదా? మన దేశమునందే కాదు అన్ని దేశములయందు నిది నిశ్చయము — ఈ ప్రపంచముయొక్క సౌందర్యమే నానావిధవస్తు సంకలనమువలన జనియించుచున్నది."

"అయితే, మిత్రమా!"— నే నడిగితిని — "స్త్రీపురుషులొండొరులతో స్వేచ్ఛగ కలసి మెలసి ప్రవర్తించు నాచారము మనలో లేదు గదా, ఆ విషయమునుగూర్చి యేమందువు? తెల్లవారిలోఁబలె మనలోఁగూడ స్త్రీ పురుషులు స్వేచ్ఛగఁ గలసిమెలసి తిరిగినయెడల ఇరువురకును సౌఖ్య మధికమగును గదా?"

"కమలా! మన హిందూ ఆచారభవనములో నిదియు నొక ముఖ్యభాగము సుమీ"—నా స్నేహితురాలు బదులు చెప్పెను — "ఈ భాగముపైఁ గ్రమ్మియుండు మాలిన్యమును

తుడిచివేయ — వచ్చును, వలయును—గాని దాని నసలే మా ర్చుటకు యత్నింపఁగూడదు. కమలా! ప్రతి జనసంఘము వారును సతులను వెలలేని రత్నములుగ నెంచి వారి గుణమున దోషము గలుగకుండ వారు పురుషులతోఁ గలసిమెలసి తిరుగుటనుగూర్చి కొన్ని కొన్ని కట్టుబాట్లేర్పఱచియున్నారు. ఈ కట్టుబాట్ల విషయమున ఆయా దేశములవారి కెంతెంతో వ్యత్యాసమున్నది. మనకును తెల్లవారికిని గల భేద మెఱుంగుదువు గదా? మొత్తముమీఁద ఈ యేర్పాటు ప్రశస్తమిది కాదని నిర్ధారణసేయుట సాధ్యముకాదు. తెల్లవారలపద్ధతిని మనమును మనపద్ధతిని తెల్లవారలును అవలంబింపఁగూడు ననుట కేవలము పిచ్చిమాట. అది సాధ్యముకాదు. పది యిరువదిమంది మాత్ర మిష్టపడి నూతన పద్ధతి నవలంబించిరేని, నష్టము గలుగకున్న అదృష్టమని యెన్నవలయును."

"అట్లని మన గోషా మంచిదందువు!" — అని యాశ్చర్యముతోఁ బలికితిని—"స్త్రీలను గృహాంతర్భాగములలో బిగించి మృగప్రాయులఁ గావించియున్న మనగోషాపద్ధతి!"

"షోషో! కమలా!"—నా స్నేహితురాలు ఖండించుచు పలికెను—"మనలో గోషా యెక్కడనున్నది? ధనగర్వమున విఱ్ఱవీగుచుండువారును కొద్ది గొప్ప యుద్యోగదశకువచ్చిన మీా యింగ్లీషు నాగరికులును గౌరవమని తలఁచి తమస్త్రీలకు ఘోషావాస మలవాటు సేయుచున్నారు గాని తక్కినవారిలో గోషా యెక్కడిది? పల్లెలయందుఁ గనఁగా, అచ్చటి స్త్రీలు—

పిన్నలు పెద్దలుఁగూడ— ఎల్లరు స్వేచ్ఛగ విహరించుచు తమ తమ పనులు నెరవేర్చుచున్నారో? పట్టణములయందును సామాన్యస్థితిగలవారి స్త్రీలు గోషా లేకయే తిరుగుచున్నారు. మీ విద్య, ఉద్యోగము, ధనము,— వీనివల్ల మాత్రమే కొందఱు స్త్రీలకు గోషాయేర్పడుచు మన పద్ధతి కవమానము దెచ్చుచున్నవి."

అంత నైదుగంటలు కొట్టఁబోవుట గని రంగనాయకి లేచెను. అన్ని విషయములనుగూర్చి అంతప్రొద్దు సంభాషించుచుండియు ఆమెను పోనిచ్చుటకు నా కేంతమాత్రము నిష్టము లేక యుండెను. కొద్దిదినములలో యాత్రార్థము పుణ్యస్థలములకు పయనమైపోవ నెంచియున్న దానను, పోవకమున్ను వచ్చి చూచిపోవుదునని చెప్పి నా స్నేహితురాలు కడుఁగష్టముతో నన్ను విడిచి వెడలిపోయెను.

ప్రియవరా! యీ పెద్దజాబువ్రాసి మీకు విసుగు పుట్టించితినా? లేదని నమ్మెదను—లోఁగడ నేను వ్రాసియంపిన రంగనాయకి సంభాషణ మెంతో బాగున్నదంటిరి గదా! ఈ వ్రాతవలన నాకు మేలు కలిగినది. నా మనసును మూసియుండిన విచార మేఘము విడిపోయి మీ ప్రేమకిరణములు ప్రవేశింపఁదొడఁగినవి. మీ ప్రేమను గోరియున్న దానను. ప్రాణప్రియా! మీ ప్రేమయును, మీ సదయహృదయమునుండి ఒక్క మృదువాక్కున్ను బంపుఁడు. పంపుటకు తీరిక లేదా? లేక — అయ్యో! అది నే వ్రాయఁజాలను!

## 19 - వ లేఖ.

నేఁడుకూడ ఆశాభంగము! ఇంక రేపటిదినము మీ జాబు రాదు, మీరే వత్తురుగదా — ఎల్లుండి బంగాళాలో ప్రారంభించునట్టి వివాహకార్యమునకు?

ఈ జాబు మీ స్థానమునకు చేరకమున్నే మీరు పయనమై యుందురు. అయిన నేమో యెట్లుండునో యని దీనిఁ బంపుచున్న దానను. ఎవరు కసరి, చివఱకు మీ రిచ్చుటకి రాకుండ నే యాటంకము కలుగునో — నాదని యెన్నుకొనుచున్న భాగ్యమును, నా సంతోషమును, పాడుచేయుటకు? ఇటీవల నాకు గ్రహపాటు చాలకయున్నది — ఎట్టి దురవస్థ తటస్థించి నను ఆశ్చర్యపడఁజాలను.

మన మొండొరుల విడిచియుంటను గూర్చి పలువురు పలు తెఱఁగులఁ జెప్పుకొనుచున్నారు—ముఖ్యముగా, నాకు మీరుదయించకమున్ను నన్నుఁ గోరుకొన్న కోఁతులమూఁకకు నగ సందైనది. కొందఱు పలుగాకులు మన ప్రేమలస్తమించిన వని వాడుక వేయుచున్నారు! ప్రియవరా! మన ప్రేమలకా అస్తమయము!—అయ్యో! అది యెన్నఁడేని కలుగునా!

## 20 - వ లేఖ.

ఎట్టకేలకు మీ జాబు! — ఆశాభంగముతోఁగూడ సంతోషము! నా గ్రహపాటు తప్పినదికాదు. నాభయము నిశ్చయమైనది! ఆహా! ఇట్లె నా భయములన్నియు నిశ్చయములగు

నేమోకదా ! ఈ వట్టితలంపునకే నాయొడలు గడగడ వడం కెడి. మఱిమఱి తలంచిని మతి చెడుట నిశ్చయము !

ఇంతకు - వివాహకార్యమునకు మీరు రాఁజాలరు - ఒక దినముగూడ రాఁజాలరా? అయ్యో యెంత విచారకరము ! మీరు రాకున్న, మిముఁ బుత్రునిగఁ బ్రేమించు ముసలాతనికిని మీ గంగాదేవికిని ఎంతో కొంతగ నుండునుగదా ! ఎటు త్రిప్పిన నటుతిరుగునట్టి కీలుబొమ్మ గంగ మాటల కేమి పొమ్మని వ్రాసితిరి - ఆహా ! ఈ పెండిలి నాల్గుదినమ్ములు ఆపెవలన ఎన్ని పొడుపుమాటలు ఎన్ని యపహాస్యములు నున్నవో ! మీరు లేక నాకీ పెండిలికి పోవలెనని యే లేదు. కాని, మీ మాట త్రోసివేయలేక, మీ మనసు నొప్పింపఁజాలక, పోవు చున్నదానను.

ప్రాణప్రియా ! ఇన్ని దినములు జాబువ్రాయని మీ బాకి యంతయు నేఁటి యీ లేఖలోని మీ మధుర వాక్యములవలనఁ దీర్చికొంటిరి. నా లేఖలు మీ 'కెంతో మనోహరములుగ' నున్నవా! వానిని 'దాచిపెట్టి మఱిమఱి చదివి సంతోషించు' చుందురా ! "గ్రహణవర్ణన మత్యంతరమ్యమై కవీశ్వరుల కును గౌరవము తేఁ దగియున్నది. నా ప్రాణేశ్వరి కవితా శక్తికి నే నెంతయు గర్వంపడుచున్నవాఁడను. మన ఆనరేబిల్ మెంబర్లపై మంచి వ్రేటు వేసితివి. ప్రగల్భరాముని పరిణయవర్ణనము చదివి చదివి నవ్వితిని. రంగనాయకి సంభాషణము నా తలంపులను నూతనమార్గమున ప్రవేశపెట్టినది.

అన్నిటికంటె ఇచ్చటి స్థాయచ్చర చెలికత్తియలకంపిన నీ వరదనముల కెక్కుడానందము చెరది నీ యుదారత్వమునకు ఇనుమడిగ నిన్ను ప్రేమించుచున్నవాఁడను."—ఆహా! ప్రాణ ప్రియా! ఇట్లు నాల్గయిదు తీయని పలుకులతో నన్నుబ్బించి సమాధానపఱచి సంతోషపెట్టుచున్నారుఁగదా!

కొఠారికొమ్మను గూర్చుండి అందరానిపండుగ నుండిన నన్ను మీ ప్రేమయనెడి నిచ్చెనవలన సంపాదించికొని సంతోషముతోఁనుప్పొంగి గర్వించి యుండఁగా ఓర్వలేనిదైవము మన కెడఁబాపు కలిగించెననియు ప్రతి నిముషమును మరణముగ పునర్జన్మముగ నున్నదనియు వ్రాసితిరి. ఆహా! మనోహరా! మిమ్మీపట్టున నా హృదయమున గ్రుచ్చుకొనక ఎట్లు జీవించఁగలను? తమ పొందుకై ఆఁకలిగొని యెట్లు కృశించుచున్నదాననో, తమ ప్రేమామృతముకొఱకెంత డప్పిగొని యున్నదాననో యెఱుంగుదురా? అయ్యో! ఈ యాఁకలియు డప్పియుఁదీర్చి యెప్పుడు నా ప్రాణమును—నా యాత్మను—రక్షింతురో!

నాస్వకీయ ప్రియధనమా! పూఁదోటలోని పొగడపువ్వు లేరి మీకొఱకొకదండ గ్రుచ్చితిని. దీనిని నా పేరుగ ధరించి మీబాధకొంచెమేని సహించుటకు ప్రయత్నించిచూడుఁడు!

ప్రియవరా, వందనము! పెండిలినుండి మరలవచ్చువఱకు వందనము! మీ హృదయము నా స్వంతముగ నుండనిండు!

## 21 - వ లేఖ.

సంతోషమధికమై చాలుచాలు ననిపించినది! ప్రాణప్రియా! బంగాళాలోని వేడుకలు తనివిదీర ననుభవించితిని. రేయుం బవళ్లు ఆనందసాగరమున మునిఁగిమునిఁగి తేలితిని. అందులో వరుసగా ఐదు దినములు!—ఆహాహా! ఇంటికివచ్చిన పిమ్మట ఇప్పుడెంత నెమ్మదిగా హాయిగా నున్నది! వివాహపు విశేషములు నావల్ల వినవలెనని మీరెంతో కోరుచుందురుగదా? వానినెల్ల వివరించుచు పెద్దజాబు వ్రాయుటంకింకను శక్తి చాలక యున్నదానను. కొద్దికొద్దిగ వ్రాయఁ బూనవలెను.

నిశ్చయముగా — ఎంతో యిష్టములేకయే పెండిలికిఁబోతిని. కాని, పోయినపిదప ఆగడబిడలోనంతయు మఱచిపోయి అచ్చటి మాధుర్యమును మనసారఁ గ్రోలితిని— మీరు లేక యితరులవలనఁ గలుగునంతవఱకు సుమీ! గంగాదేవి దెప్పు మాటలును చిటచిట చూపులును ఒక్కింతయు లక్ష్యము సేయనైతి. మంచి యిల్లాలు మీగంగ యనుగ్రహమున నాకొక క్రొత్తబిరుదులభించెను—తీర్పులుదిద్దే మగపడుచునఁట!

తీర్పులుదిద్దే మగపడుచు! ప్రియవరా! ఒకవిధమున నేను మగపడుచునే యగుదును. అనగా, ఆడువారితోఁబలె మగవారితోడఁగూడ కొంతవఱకు స్వేచ్ఛగ ప్రవర్తించుదానను గనుక. నేనాతీఱున పెంచఁబడితిని, అటుగాకున్న మీకబ్బి యుండనుగదా? ఈ పెండ్లికి వచ్చిన కొందఱు పేరక్కలవలె లేనిపోని బిడియ మభినయించుట యెఱుఁగనని నాకు విచార

మును లేదు. కాని, తీర్పులు దిద్దే దానివలె నే నెన్నడును ప్రవర్తించియుండ లేదు—అందులో బంగాళాలో బొత్తిగ నే లేదు.

పెండ్లి కొమరితకు జడ వేసి యా బిడ్డకు బొమ్మవలె నలంకరించకుండ చీరగట్టి సింగారించితి నందురో, అమ్మలక్కలందఱు మఱి మఱి బతిమాలుకొనఁగదా యాపనిఁ బూనితిని? పెండ్లికార్యములలో ఆ చిన్నదాని వెనువెంటనె తిరుగుచు తల్లివలెఁ గాపాడితి నందురో, అది మిముఁగూర్చి—చంచలయెడ మీ కేర్పడియున్న పితృభావమునుబట్టి—కదా? ఇంక పేరంటమునకు వచ్చిన యింతులకెల్ల మర్యాదలొనర్చి చందన తాంబూలాదులొసఁగితినో, వారిపై పన్నీటిధారలు ధాటిగఁ గురిపించితినో—మీకు సోదరతుల్యుఁడైన చంచలతండ్రి, మిముఁగూర్చి తన భార్యకు, ఆ యర్భకురాలికి, అన్నిటఁ మన స్ఫూర్తిగఁ దోడ్పడునట్లు నన్ను వేఁడికొనఁబట్టి కదా? ఇంక నెవరెట్టిమాటలన్న నాకేమిచింత? తీర్పులు దిద్దెడి దానిగ మీకంట్లకుఁ గాన్పింపక మీ మెప్పు పొందఁగలిగిన నాకది యే పదివేలు. కాని, ప్రాణప్రియా! ఇట్లు ప్రేమవలనఁ జేసిన పనులకు వెక్కిరింతలు బహుమతిగాఁ గొనుట కొంచెము కష్టముగనే యుండును—అందులో మంచి చెడుగు లెఱుంగని మడ్డికొక్కిరవలని వెక్కిరింతలు!

ప్రాణేశా! ఈ నాయాగ్రహమునకు భయపడకుఁడు. ఆ గ్రహమంతయు ఈ కాగితముపై వెడలఁగ్రక్కి యింతటితో [illegible]ర్చితిని. బంగాళాలో—పెండ్లికివచ్చిన